

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

చిత్రకవి. సింగరార్య

కృతమై

పండిపెద్ది, కృష్ణస్వామి

కృతముగా

వ్యాఖ్యతోనున్న

# బిల్హణీయము.

ఇది

హర్, హైనస్, ది, మహారాజకుమారికా, సాహెబా

మహారాణీ ఆఫ్ విజయనగరం వారి

ద్రవ్యసహాయమువలన

శ్రీ వారియాస్థానవిద్వత్కవి యగు

పురాణం-సూర్యనారాయణతీర్థులచే

ముద్రింపించి

ప్రకటింపబడినది.

1911

# విషయసూచిక.



## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

# విషయసూచిక

ఓం నమః కామేశ్వర్యై.

# బిల్హణీయము.

## ప్రథమాశ్వాసము.

---

శ్రీరామావనిజానిజాయతభుజాశృంగారశాఖామిళ
త్సారాకారలతాస్తనస్తబకభాస్వద్దంతవాసఃకిసా
లారాళాలకభృంగరంగదఖిలాంగాంచత్ప్రసూనోత్కర
శ్రీరామాకృతికల్పకంబు మము రక్షించుఁ బుధానందమై. 1

క. భవనరసిజసంభవముఖ, భువనస్థసమస్తదేవముఖ్యుల
కెలమిం, బ్రవిమలమతి ప్రమొక్కెద మ, త్కవితకు
సంతతము సత్ప్రకాశత గలుగన్. 2

క. ధర దోషోదకముల నిడి, గరిమఁ సుగుణా
మృతంబు గైకొనుకీర్త్యా, కరవరమానసవసనం,
చరసత్కవిహంసములను సంస్తుతి సేతున్. 3

తే. నిర్మలావయవమ్ముల నెమ్మి విడిచి, వ్రణములకుఁ బోవు
మక్షికాప్రతతిభంగి, నొప్పులు గ్రహింప కొప్పుఁ
దప్పు లరయు, కాకవులమూఁక వీక నిరాకరింతు. 4

వ. అని యివ్విధంబున నిష్టదేవతానమస్కారంబును సత్కవిపురస్కారంబును కుకవితిరస్కారంబునుం గావించి యే నొక్కనాఁ డెక్కున్న యగుమహోత్సవం బొక్క హృద్యవిద్యానవద్యు లగువిద్వద్వర్యులు గొలువఁ గొలువుకూటంబున నధివసించి సముచితగతుల సత్కథావి దీపించు నవసరంబున

తే. చిత్రకవివంశదుగ్ధాబ్ధిశీతభానుఁ, డనుపమానోక్తి
శ్రీసింగరార్యసూనుఁ, డమితకవితావిశేషజ్ఞుఁ
డనఁగ వెలయు, నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి. 6

క. శ్రీపండిపెద్దిసత్కుల, దీపక కాశ్యపసగోత్ర దివ్యన్నానా
భూపాలకమకుటమణీ, శ్రీపదపాదాగ్రభూమి కృష్ణస్వామీ. 7

సీ. కుత్సితకాణాదకుత్కీలకవిభేద, సంసక్తయుక్తివజ్రప్రహార,యణకాంక
పాణినీయాటవీపాటన, చటులసూక్తివిహారపటుకుఠార, నిర్ణీతికృత
జైమినీయతూలోద్ధూత, సంస్కారవాక్యఝంఝూసమీరదుర్మతవే
దాంతమర్మతమశ్ఛేద, భాసురవచనప్రభావసార

తే. కావ్యనాటకలసదలంకారసాహి, తీసుసంపన్న
రసలసద్ధీరహృదయ, పండిపెద్దికులీన సంపన్నిధాన,
పాలితకవీంద్ర శ్రీకృష్ణపండితేంద్ర. 8

వ. అని వినుతించి వినుము భవదీయంబు లగుచతుర్దశవిద్యాప్రభావం
బులు సకలభాషావిశేషంబులు సమస్తచమత్క్రియావినోదంబులు
నెన్న నిన్నరులకుఁ దరంబు గాదు నిఖిలలోకంబులఁ గృతిముఖంబునఁ
గీర్తి నిత్యం బగు నట్టికృతులయందు నాంధ్రం బతిరమణీయంబు గా
వున నొక్కపురాతనకథ నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాం
కితంబు సేసి యాచంద్రతారార్కంబుగా సత్కీర్తిం గాంచు మనిన
న్నేనును సంతోషితాంతరంగుండ నగుచు. 9

క. మున్నింద్రతనూభవునకు, వెన్నుండు
సహాయుఁ డైనవిధమున నే నా, సన్నుతసద్గుణగణసం
పన్నుం డగుకవివరాధిపసహాయమునన్. 10

షష్ఠ్యంతములు.

క. శ్రీజనకసుతాహృదయమస, రోజాతద్యుమణి
కి జవిహూపాత్తమరు, దాత్మజప్రముఖామర్త్యస,
మాజాగ్రణి కరిజనాసుమరుచసిఫణికిన్. 11

క. తుండీంద్రతుండనిభదో, ర్దండస్ఫుటకాండనిర్జి
తమహోద్దండ[illegible]ండునకున్,

క. సుందరపదారవిందము, రంజముదితబుధపురంద
రమిళిందునకుం, గుందశరత్కుందవృష,
స్యందనచందనకనద్యశఃకందునకున్. 13

క. హరితనయహృదయసారస, హరికి మహాసూనృతజిత
హరి కలితేజసి, పరిహసితహరికి భవగజ,
హరికి సదాపాదపంకజానతహరికిన్. 14

క. వరధీధిక్కృతచక్రిం, గరథికి సౌందర్యహసితకరథికి వినమ
చ్ఛరధీకృతశరధికి దా, శరథికి ధృతశరధి కురగశాత్రవరథికిన్. 15

క. శాంతునకు దాసహృదయని, శాంతునకు నితాంతనయన
చాకోరయుగా, క్రాంతమహీజాస్యకళా,
కాంతున కానందభరితకపికాంతునకున్. 16

క. శ్రావణహరణునకు జిత్రై, రావణచంక్రమణునకు
ధరారమణునకుం, బావనజనభరణునకున్,
భావసయాభరణునకు నభంగరణునకున్. 17

క. రామునకు నీలమేఘ, శ్యామునకు దివాకరాన్వయాం
భోధిసుధాధామునకుం బరశురామవి,
రామునకు సమస్తభూవరలలామునకున్. 18

వ. అంకితంబుగా నాయొనర్పం బూనినబిల్హణీయం బనుమహాప్రబంధం
బునకుం గథాక్రమం బెట్టి దనిన. 19

లక్ష్మీమందిరపురవర్ణన.

తే. వసుమతికి నాభిభూత మై వఱలునట్టి, ధర్మశిఖరికి
నుత్తరభాగమందు, భద్రపదలలితంబు సుజనసం
దోహచరిత, దివ్యదేశంబు పాంచాలదేశ మమరు. 20

వ. అందు. 21

శా. శ్రీరామామణి కాటపట్టు హరికిన్ శృంగారవాసంబుం జై
త్యారత్నంబుల కెల్ల నాకరము సమ్యగ్వ్యాపినీపాళి కా
ధారం బన్యదురాసదంబు విబుధశ్రేణంబు రాజాత్తిచే
శ్రీరమ్యం బగు సిందురీతిం [illegible] 22

క. ఆపురము జయశ్రీలకుఁ, గాపురము సమంబు
ద్వారకాపురమునకున్, భూపురములలోఁ జెల్వగు,
గోపురముఖచుంబితైకగోపుర మగుచున్. 23

క. సతతశిర స్థలవిసరద, దితిసుతతటినీతుషార
దీప్తాబ్జము లై, నుతి కెక్కు సౌధరాజము,
లతులలితశివమూర్తు లనఁగ నప్పురిలోనన్. 24

ఆ. కనకగోపురాగ్రఘటితగారుత్మత, రత్నరుచులు
కుముదరాజు లేడి, తొడరి మెసవఁ జూచు దూర్వాంకురము
లని, చను మృగేంద్రముఖము లునికి నులికి. 25

సీ. ఒకచోటునను బోటు లొకనీటు గొని మీటు, వీణెలనాదంబు వేడ్క
సేయ, నొకచెంగట సభంగసకలాంగయుతమంగ, శమ్మృదంగరవము
ధింధిమి యనంగ, నొకవంక గతశంక నకలంకముగఁ బంక, జాస్యలు
చెలఁగి లాస్యములు సలుప,నొకచెంత వగఁ గాంత లొగి వింత గొని
సంత, సము మీఱ సరస గీతములఁ బాడ

తే. వెలయు బహువిధవాద్యసంవేద్యహృద్య, ఘుమఘుమార్భటి
దిక్కులఁ గొమరు మిగుల, జనుల కానందరసము నిచ్చలు
ఘటించి, రంజితావనిజాని యారాజధాని. 26

సీ. సురసాలసంతతి సురసాలసంతతి, గతి ఖగాళికి ఫలోన్నతి యొసంగు,
మహితకాంచనములు మహితకాంచనముల, పోలిక నామోదములు
ఘటించుఁ, గలితపున్నాగముల్ కలితపున్నాగము, లట్ల కొమ్మల
తోడ నమరియుండు, రంభాదినటనము రంభాదినటనము, కిరణి మరు
త్ప్రసంగములఁ బొదలుఁ

తే. బనస లెంతయుఁ బనసలభాతి ద్విజుల, కును బదక్రమసం
యుక్తిఁ గొమరు మీఱు, నగము లున్నతి నగముల
పగిది వనుల, నలరుచుండు విపత్త్రంబు లగుచుఁ బురిని. 27

క. ఆవసములు ద్విజసందో, హావసములు తులితవృత్ర
హావసములు స, త్సేవనములు పూర్గికసం,
జీవనములు చరితభువనజీవనము లగున్. 28

బ్రాహ్మణవర్ణనము.

మ. కులసంరక్షణులుగ సువాక్సమహితుల్ గోత్రాహితుల్ జాతవే
దులు ధర్మాత్ములు భాసురాఖ్యభువనాప్తుల్ సజ్జగజ్జీవనుల్
కలితార్థప్రదు లార్జితార్యులు కనత్కాంతుల్ తమోదూరు ల
య్యెలధాత్రీసురు లెంతయుగ విబుధులై యింపొందుటల్ చిత్రమే.

రాజన్యవర్ణనము.

సీ. చక్రములకుఁ గీడు సలుపనిరాజులు, దివిరి సత్త్రముల భేదింపనియిను
లిలఁ గుభృత్తులకు వెన్నీనికూర్మిపతులు, గోత్రవర్గము బల్మిఁ గూల్ప
నింద్రు,లరికి మార్గముగానట్టిపూరుషసింహు, లనయంబు మూల
నుండనిమహేశు, లోకనిదాఘుఁ జేరనోపనిశీతులు, పుణ్యంబు దప్ప
నిపుణ్యజనులు

తే. ఔర ఏ రస వీరసవైకపరులు, పరఁగుదురు పురి
శుచిభానువంశ్యు లగుటఁ, గువలయానందసంధాయి
గుణతమోప, సరణనై పుణ్యవిభులు రాజన్యవిభులు. 30

వైశ్యవర్ణనము.

మ. ఒకశంఖంబునఁ బొంగు నర్థపతి యుద్యోగంబు దా మురగ భజం
పక రత్నాకరుతోడిసఖ్యమునకుం బాటించి సంఖ్యాధిక
ప్రకటార్థాఢ్యతచేఁ జెలంగి బహుమిత్రప్రాభవాసిద్ధరూ
పకసంపద్విభవంబు గాంతురు పురిన్ వైశ్యోత్తముల్ వేడుకన్.

శూద్రవర్ణనము.

క. హలపాణి యొక్క నాఁగలి,గలవాఁ డని తెల్లఁజేసి కడువేడ్కఁ బురిం
గలవిష్ణుపాదజావళి, యలరారె సువర్ణయుక్తి వ్యవసాయమునన్. 32

ప్రకారాంతరము.

క. తనయులవిభవము తండ్రికి, గొన రాదే యనుచుఁ
బురిని గోరినధాన్యంబును హరిపదజులు రాసుల,
నొనరించిరి హరిపదంబు నొందఁగ నెందున్. 33

గజవర్ణనము.

చ. సరసిజబాంధవుండు ముసచాయ. ననూరుఁడు తేరు దోల ను.

స్త్రీవర్ణనము.

సీ. తమ్ముల దోషాప్తి గ్రమ్మఁ మూసినయట్టు, నయశాలులను బొట్టొనర్చు
కొనుటఁ, వసుధ మహాహీనువశత నిల్పినసడి, కలనదావర్తులఁ గ్రా
చునగడు, భోగి నధోగతిఁ బొందించుపాతకం, బాదిత్యకవులమే లడ
చుకొదవ, కడుఁ గళానిధిఁ దమోగ్రస్తుఁ జేసినదూరు, ఘనుల వివర్ణ
త గలుపుకలఁక

తే. సలుప తప్పించుకొనియోఁ దన్నగరసతుల, యలరుపదములు
మృదుజంఘ లరిదిపిఱుఁదు, లలఁతినాభులు మెఱుఁగారు
లఘుకుచము, లమరుమోములు వరకుంతలము లమర్చి. 40

సరోవర్ణనము.

సీ. విబుధేంద్రచారకుల్ వెలయుట నొకవంక, గీర్వాణపురతరంగిణి
యనంగఁ, గమలోదయస్ఫూర్తిఁ గాంచుట నొకవంక, నిర వొందుకల
శసాగర మనంగ, రాజహంసవిహారరమణీయతర మాట, నొక్క కేప
మానసం బో యనంగ, ననిమిషాంచితజీవనాభిరూపం బౌట, నొకచో
సుధాపూర మో యనంగ

తే. వెలయు నెంతయుఁ దత్పురవివిధవీథి, కాంతరాళ
ప్రదేశనితాంతఖచిత, నవ్యనవరత్నసోపానభవ్యపార్శ్వ,
రాజితం బై నకమలాకరవ్రజంబు. 41

తే. రమణ మీఱులక్ష్మిమందిరమ్ము నేలు, నినుఁడు పాంచాలుఁ
డాపురి యెన్నఁ బద్మ, నీమణి కరగతయు నై వినిద్రవృత్తి,
నతులితామోద యయ్యె సదాళు లలర. 42

సౌధవర్ణనము.

ఉ. కాంచనపద్మరాగశశికాంతమణీగణకల్పితోజ్జ్వలో
దంచితసౌధరాజములు తత్పురి నొప్పె ధ్వజాన్వితంబు లై
మించినభీతిఁ బత్త్రియుతమేరుముఖాచలపంక్తు లంత నే
తెంచె ననంగ భూతిసమదేవపుఁ డైనధరేంద్రుపాలికిన్. 43

పుష్పలావికావర్ణనము.

స్థిరతరతన్నిబద్ధవరజిహ్మగపాశము లోలి వ్రేల న
ప్పురికిరు లజ్జనాశనములె పో యని తుండము లెత్తె దక్షిణో
త్తరముల నేగు భీతిమెయిఁ దత్ప్రహితేక్షణుఁ డై రయంబునన్.

అశ్వవర్ణనము.

చ. వరుస నిజేశు మూలఁ బడవైచినయట్టిమరుత్తురంగముల్
సరి గొనకే జవంబు గొని సాగిన నాశుగ మై సమీరుఁ డా
ర్చి రహిని రాఁ దదాకృతి హరించెఁ బదోద్ధతధూళిఁ గప్పి త
త్పురితురగోత్తమంబులు విభూషితసాదిబలోత్కరంబు లై. 35

రథవర్ణనము.

చ. సమములు గావు వాజు లని సారథి కుం టని గాలికూడు వ
గ్గము లని చక్ర మొంటి దని కాలునవంతమణీవజ్రప్రభా
వమహిత మై ఘనావరణవైఖరితో నలరారురాజితో
త్తమరథరాజి భానునిరథంబును నవ్వు సదా సముద్గతిన్. 36

ప్రకారాంతరము.

చ. నగరశతాంగబృందము లనంతగతోన్నతు లై చరింప దే
వగణము తద్రథాగ్రగతివైభవ మొందినవ్యోమయానముల్
వగచుచు మానముల్ దొరఁగి వర్తిలుచున్నవి నాఁటనుండియున్
జగతిని దానఁ జేసి కొన సాగెను వానివిమాననామముల్. 37

భటవర్ణనము.

క. కట్టింతురు రుగ్గు నయినను, దట్టింతురు హరుల
నైనఁ దలఁగనికడిమిం, గొట్టింతురు
జము నైనను, బిట్టింతురు రిపుల నెల్ల భటు లప్పురిలోన్. 38

ప్రకారాంతరము.

చ. కులిశకఠోరహస్తముల ఘోరమదావళదంతకాండముల్
బలిమిఁ బెకల్చఁ గొండలు చలంబున దండిగఁ బిండి సేయ ను
జ్వలలయకాలు నైన గెలువం దగులావరు లిప్పురంబునన్
వెలయుదు రద్భుతార్భటులు వీరభటుల్ చటులాహవోద్భటుల్.

నీకులుకఁజెం డ్లేవి పైకమ్ము దప్పించు, పైకమ్ము దప్పనే చేకొనంగ
నెంత నీకై దండ నిచ్చెదవఁటె మేలు, కైదండ యిత్తురే కరఁ మెడలఁక
భావింప రుచియే మొ బంధుజీవం బేది, యీబంధుజీవనం బెందుఁగలుగు

తే. ననుచు వీథుల సరసనర్మానుకూల, వచనరచనల
మెలఁగుచు వఱలువిటుల, కనుగుణంబుగఁ బలుకుచు
ననుదినంబు, వెలయుదురు వీటఁ బుష్పలావికలు ప్రీతి. 44

వ. మఱియు నప్పట్టణంబు మణిఘటితకాంచనఘనావరణంబులును, ఘ
నావరణనివారణపటుపటాంచలానిలకేతనాంచితసౌధరాజంబులును,
సౌధోపరిసబద్ధ ముక్తామయశిరోగృహంబులును, గృహారాజితమణిక
వాటంబులును, కవాటవిరచితమరకతమణిశోభావిరాజమానతోరణ
ప్రకాశితద్వారంబులును, ద్వారోభయపార్శ్వరమ్యరత్న వేదికలును,
వేదికాంతరరచితవిద్రుమంబులును, విద్రుమవైదూర్యస్తంభసముద
యంబులును, స్తంభసంభృతశాతకుంభకుంభపిలసితమంటపంబులును,
మంటపాభ్యంతరసంచరత్సుందరీజనంబులును, జనసందోహసంపూరిత
వీథికారాజంబులును, రాజకుమారారూఢసంచరద్గంధసింధురసైంధవ
రథనికరంబులును, కరవిన్యస్తవీణావాదనప్రవీణగాయకులును, గాయ
కయుక్తమృదంగతాళాదిలాస్యసంరంభవిజృంభమాణారంభాసమాన
వారకాంతలును, కాంతనిరంతరసురభికుసుమఫలభరితపాదపోద్యానం
బులును, నుద్యానాంతరకనత్కమలకల్హారమరంద పానతుందిలమిళింద
బృందఝుంకారప్రమోదమేదురసారసహంసచక్రాది జలవిహంగసంకలి
తసరసులును, సరసమనోహరపరిమళమిళిత శీతలపవమానంబులునుం
గలిగి, యమరావతీవిధంబున లోహితాశ్వవిలసితం బై, తేజోవతీనగ
రంబుపోలుపున సమవర్తిరాజితం బై, నైరృతినిలయంబుకైవడిఁ బు
ణ్యజనోద్దీపితం బై, వరుణమందిరంబు రీతి ఘనపుష్పమాలికాశోభితం
బై, పవనునిగేహంబుభాతి నానాసుగంధబంధురం బై, యలకాపురం
బు బాగున ధనదమహితం బై, కైలాసంబులాగున రాజశేఖరరమ్యం
బై, కమలగర్భసదనంబుపోలిక మహితభాషాసమన్వితం బై, హరినివా
సంబుచాడ్పున నిత్యముక్తానుగమ్యం బై, భోగవతీపుటభేదనంబుతీరున

త్రం బై, సాకేతరాజధానివడువున రామలక్ష్మణోపశోభితం బై, ద్వార
కయందంబునఁ గృష్ణబలభద్రప్రకాశితం బై, హస్తిపురివైఖరి గాం
గేయాదిభూషితం బై, యింద్రప్రస్థపురంబుమాడ్కి నసుగతధర్మజా
తం బై, వారణాసిచూడ్కిఁ బ్రచండకాలభైరవశూలహస్తరక్షితం
బై సిరుల నిర వొందుచుండు. 45

## మదనాభిరామవర్ణనము.

క. ఆజగతికధీశ్వరుఁ డై, రాజిలు మదనాభిరామ
రాజేంద్రుఁడు జన్యాజితబాహాపవిధా,
రాజితసముదోన్నతారిరాడ్గాత్రుం డై. 46

సీ. రమణ లక్ష్మీమందిరమ్ము మేలమ్ముగాఁ, గని సదాళి గుణమ్ము గా
గ్రహించి, మధురధర్మముఁ బూని మాధవు లోఁ గొని, యలఘుద్విజా
వళి నాదరించి, దాక్షిణ్యశాలి నొద్దనె నిల్పికొని కళా, నిధిపన్యమున
రుచుల్ నింపఁ జేసి, శోభితం బగుమహాసుకృతిభావము గాంచి, వసస
త్యరతిమనోహరత మించి

తే. కలన భయదోగ్రమూర్తిసంకల్ప మడఁచి, ఘనసుదృక్పా
శికామానకర్త యగుచు, నతనువిఖ్యాతిచే మద
నాభిరాముఁ, డలరు నిజనామగరిమ యథార్థముగను. 47

సీ. విసములోపలఁ జిక్కి వెడలరానిస్వయంభు, లాలితవాణీవిలాసుఁ జేసె
నొంటికాఁ డై దాన మొరుని వేఁడినచిరం, తనమాని మేటిభూధవుఁ జే
సె, నచలాధివాసుని, నాదిభిక్షుని సర్వ, మంగళానుభవసంప్రాప్తుఁ జే
సె, బహుళార్తిభేదవిభ్రాంతిఁ గుందుకళంకిఁ, దనతోడఁ గూడ సత్ప్రాప్తిఁ
జేసె

తే. నెన్న నీగుణ మీధర్మ మెంతుఁ గలదొ, తగ నయుక్తుల
సంయుక్తులుగ నొనర్చు, నితని మదనాభిరామాఖ్య
మిడిననలువ, కౌశలంబు గణింప శక్యంబె తలఁప. 48

సీ. రమ్యగుణశాలి యాభూపురందరుండు, డాఁగాఁ గొని
లీల మండోదరమాల, ననుదినముఁ గాంచి క్రీడల నతిశ
యుల్లు వనవిఁ బాలించు బుధనికాయములం [illegible]

యామినీపూర్ణతిలకావర్ణనము.

క. ఆయనఘున కుదయించె మ, హాయతగుణజాల బాల
యుంచితలీలం, దోయజసాయకునాఱవ,
సాయక మని భూజనాళి సన్నుతి సేయన్. 50

సీ. సకలంకసంగవాంఛాసక్తి దగ దంచుఁ, గమలారిఁ బొఁరగినకళ యనంగ, మే నెఱుంగనివానిమిత్రత్వ మన దని, మకరాంకు వీడ్కొన్న మాయ యనఁగ, నిరవలంబావాసనిరతి కాని దటంచు, సురపథం బెడలినచుక్క యనఁగ, మలినాంతరంగసంబంధ మాఱడి యంచు, మేఘంబు వీడినమెఱుఁగు గనంగఁ

తే. జాయలను జెల్వ మైనలేఁబ్రాయమునను, జనుల కల్లారు
ముద్దుగా ననువుపడుచు, నాటపాటలు సలుపుచు నవని
బాల, యామినీపూర్ణతిలకాసమాఖ్య నలరు. 51

వ. ఆకుమారీరత్నంబు దినదినప్రవర్ధమాన యై యున్నయెడ. 52

క. మృగమదమున రుచి పుట్టిన, పగిదిని జెఱకునకును బండు పండినరీతిం
దగ సురభి పసిఁడి నొదవిన, పగటున యౌవనముదనరె బాలామణికిన్.

పాఠాంతరము.

క. కుందనమునందుఁ బరిమళ, మందినక్రియ
మృగమదంబునం దమర రుచుల్, బొందినగతిఁ
గుసుమంబున, నందపుఁదావివలెఁ దరుణియౌవన మలరెన్. 53

సీ. మహితయౌవనరూపమధుమధురాలాప, బింబోష్ఠి శ్రీవర్ణబింబకర్ణ
కంజాతదళనేత్ర కాంచననిభగాత్ర, చతురచంపకనాస చారుహాస
పటుసైకతశ్రోణి పల్లవాంచితపాణి, ప్రౌఢసౌభాగ్య సంపన్నయోగ్య
కరికుంభకుచపాళి ఘననీలరోమాళి, కుముదాప్తవదనసత్కుందరదన

తే. యలసమరువంపుమొలక కాయజునిచిలుక, కలితకర్పూర
తిలక సుగంధఫలక, యామినీపూర్ణతిలక నీ
లాంచదలక, రాజసము గుల్క శృంగారరసముఁ జిల్క. 54

సీ. నలినాక్షికొప్పు కృష్ణత్వంబుఁ బ్రాపించు, నెమ్మోము విధురీతి నివ్వ
టిల్లు, నబ్జాస్యకన్ను లబ్జాలోకత వహించు, నధరంబు మాధవఖ్యా

తి నమరు, నలివేణిచనుదోయి యచ్యుతత్వముఁ గాంచుఁ, జేయి ప
ద్మాహితస్థితి భజించు, నగకుచనూఁగా రనంతభూతిఁ జెలంగు, లేఁ
గాను శ్రీహరిలీలఁ దాల్చు

తే. నాభి కమలాకరత్వం బనంగ నెసఁగుఁ, దనువు హేమాంశుకస్ఫూర్తి
దనరు నిట్లు, విష్ణుభావంబు చెలియందు వెలయుచుండు,
క్షితిజనంబులు మెచ్చి సన్నుతులు సేయ. 55

సీ. ఎంతటివానినే నీనాతివదనాబ్జ, మమరఁగా లోఁగొను నద్ది మేమొ,
యేధీరు నెద నైన నీలేమచూపులు, నాటు మనోజబాణంబు లేమొ,
యెవ్వానిహృదయాళి కీతన్విచన్నులు, నరి నిగ్గుకుసుమగుచ్ఛంబు లే
మొ, యేమహాత్ముని నైన నీతలోదరిమాట, యను వొంద నిలుపు
రాజాజ్ఞ యేమొ

తే. ఏఘనుని నైన వేఁడించు నీశుభాంగి, తనువు బంగార
మేమొ యేధన్యు నయిన, మరులుఁ జెందించు నిది మరు
మాయ యేమొ, యనుచుఁ జూచినజనములు వినుతి సేయు. 56

వ. ఇట్లు తల్లిదండ్రుల కల్లారుముద్దుగా ముద్దియ యేపారుఁ బొద్దులు
పుచ్చునవసరంబున. 57

విద్యాభ్యాసము.

తే. అక్షరాభ్యాస మొనరింప ననువుపడుచు, స్వరయుతంబుగ
వీణాదివాదనములఁ జెలఁగుగీతప్రబంధవి
శేషకలన, గాననైపుణి నేర్చె సంస్కారయుక్తి. 58

సీ. రమణీయతర మైనరాయంచ మృదుచర, ణాబ్జసంగతిని నాట్యములు
సలుపఁ, జెలువ మై ముద్దులు గులుకుపల్కులతోడఁ, బెంపుడురా
చిల్క పేరు గొనఁగ, రామాయణాదిసద్గ్రంథముల్ వెలయఁగాఁ,
బజ్జఁ బుస్తకరాజి పరిఢవిల్లఁ, దాళకాలక్రియోద్ధారితంత్రీస్వర, భేదం
బులను బాణి వీణ మెఱయఁ

తే. జెలఁగు చిఱునవ్వువెన్నెలల్ చిలుకుచుండఁ, గలికితెలిడాలు
చూపులు గలయఁ బర్వఁ, బాండిమము దోఁచి భారతి
భాతి నాతి, పసిఁడిగద్దియపైఁ బాట పాడుచుండు. 59

క. ఆపాట సపసుధాలహ, రీపాటవసరసమాధురీలలితం బై,
కోపై పీనులకా పై, యాంపై కరపంబుమాడ్కి నాపైఁ దోఁచున్.

వ. ఆప్సమయంబున. 61

క. మదనాభిరామభూపతి, యొదవినసంతోషమున
మహోల్లాసముతోఁ, బాదలుచు గానము సేయఁగ,
మదవతి నిజపుత్త్రిఁ జూచి మదిఁ జింతించెన్. 62

తే. ఈకులపవిత్ర సురుచిరహేమగాత్ర, చంద్రకళ గద
సంగీతజలధి కిపుడు, దీని కిఁక సర్వవిద్యలు దేటపడఁగ,
బేర్చి సాహిత్య మొదవఁ జెప్పింతు ననుచు. 63

వ. నిశ్చయించి. 64

తే. కొలువుకూటంబునకు వచ్చి కువలయేశుఁ, డమర సింహా
సనాసీనుఁ డై ప్రధానుఁ, డగుచసంతాఖ్యు రావించి
యధికసంభ్రమ, మమున మన్నించి పలికె సమ్మతి దలిర్ప. 65

క. ఓమంత్రిశిఖామణి యిదె, నాముద్దుల
కూర్మితనయ నయమొప్పంగాఁ, గోమలగతి
లయపద్ధతు, లేమాఱక సరసగాన మింపుగ నేర్చెన్. 66

తే. గానవిద్యకుఁ దగినట్లు కన్య కిపుడు, కావ్యనాటకలసదలం
కారభావ, సరససాహిత్య మేర్పడుసరణిఁ గఱపి,
పౌఢిఁ గావింపవలయు నిరుపమమతిని 67

వ. అను చున్న సమయంబున సభాసదులు తమలో నిట్లనుకొనిరి. 68

తే. కలికిపాలిండ్లు మేలిబంగారుగిండ్లు, చానవాల్చూపు
లాసుమచాపుతూపు, లబలవదనంబు సదనంబ యబ్జరమకుఁ,
గాంతముంగురు లమ్మధుకరులసరులు. 69

ఉ. మోమఖిలంబుఁ గన్నుఁగవ ముచ్చట మీఱఁగ వత్తు మంతయుం
గామిడిచన్నుదోయి కనుఁగొను సమస్తము మిన్న చూడఁగా
హేమము తత్తనూవిభవ మీరుచిరాంగికి విద్య చెప్పఁగా
నీమహి నెవ్వఁ డోపు స్మరియించినమాత్రనె భ్రాంతి పుట్టదే. 70

వ. అనిన విని వసంతుండు భూకాంతున కిట్లనియె. 71

క. ఓరాజ సకలశాస్త్రవి, శారదు లీపురమునందుఁ
జాలం గల ర, వ్వారి నిటకు రావించి వి,
చారింపఁగవలయు విద్యఁ జదివింపంగన్. 72

చ. అన విని సర్వశాస్త్రములయందుఁ బ్రశస్తినిఁ గొన్న యార్యులన్
ఘనమతిఁ బిల్వఁ బంచి నయగౌరవముల్ పచరించి వారలన్
గనుఁగొని పల్కె భూవిభుఁ డనంతగుణోన్నతులార మీర లుం
డిన ఫలమేమి యొక్కటి ఘటింపుఁడు మా కన వార లత్తఱిన్.

సీ. తర్కశాస్త్రమునందుఁ దత్కల్పనలయందుఁ, బరికింపఁగను మహా
భాష్యమందు, శబ్దశాస్త్రమునందు సకలతత్త్వములందు, శ్రుత్యంత
ములయందు శ్రుతులయందుఁ, దత్పదక్రమజటాంతముల నారోహావ
రోహములఁ బురాణరూఢియందు, స్మృతివిషయమ్ములఁ దెలుఁగు మం
త్రగ్రంథ, ములయం దితరశాస్త్రములను మఱియు

తే. ఘనుల మై వాదములఁ బ్రసంగములు చేసి, గెలిచి యున్నట్టి మా
ముఁ బ్రసంగించి యోపఁడు, గెలుచు మావంటివార లేకలనఁ గలరు,
రాజ్యరఘుపతి మదనాభిరామనృపతి. 74

చ. అన విని వారి కిట్లనియె నాత్మ ముదంబున భూమిపాలుఁ డో
ఘనమతులార మీర లిటఁ గౌశల మేర్పడఁ గావ్యనాటకా
భినయకవిత్వచాతురిమ పెం పఖిలంబుఁ గనంగఁ జేయుఁడీ
మనసిజరాజపుత్త్రికిని మద్వరపుత్త్రికి మంజుగాత్రికిన్. 75

వ. అనిన విని యార్యవరు లాభూవరున కిట్లనిరి. 76

క. మేము రసజ్ఞుల మధిపా, కా మయ్యె రసజ్ఞు లనఁగఁ
గవివరులే కా, దా మాకుఁ గవిత్వము లే,
దీమహిఁ ఛాందసులఁ బొందుమనే యది తలఁపన్. 77

వ. అది యెట్లంటేని. 78

సీ. శబ్దాపశబ్దవిచారి యైనట్టి వ్యా, కరణజ్ఞు జనకునిఁగాఁ దలంచు, యు
క్తివాదములచే నొప్పారు తార్కికు, భ్రాతఁగా బుద్ధి నేర్పడఁ ద

లంచు, నెఱి నిరాచరవృత్తి నెఱపుమిామాంసకుఁ, గదియంగ షండునిఁ గాఁ దలంచు, నొదిఁగి వైదికనిష్ఠ నుండునధ్యాపకుఁ, గనలి చండాలునిఁగాఁ దలంచు

తే. వివిధముగ నిట్లు లధిప కవిత్వకన్య, కావ్యనాటకలసద
లంకారభావ, నవరసాభిజ్ఞు మది నిజనాయకునిఁగఁ,
దలఁచి వరియించుఁ ఓనుఁ దానె వలపు మించి. 79

వ. అని పలికినవిబుధేంద్రులకు రాజమహేంద్రుం డిట్లనియె. 80

క. వరనాటకకావ్యజ్ఞుఁడు, సరసుఁ డలంకార వేది
ఛందోనిపుణుం, డురుసాహిత్యకళానిధి,
యరయఁగ నెవ్వాఁడు వచింపుఁ డతనిం దెలియన్. 81

తే. అనిన మల్లాణబిల్లాణు లనఁగఁ గవులు, సరసు లిరువురు
సాహితీవరుల యందు, బిల్హణుం డనువాఁడు గం
భీరుఁ డధిక, తముఁడు కవిరాజనంగ స్తోత్రములు వడసె. 82

పండితులు బిల్హణకవిని వర్ణించుట.

శా. ఆవాచాలత యాకవిత్వసరసం బాప్రౌఢి యారూఢి యా
భావం బాపదశబ్దగౌరవము లాపాండిత్య మాశాస్త్రబో
ధావిర్భావక మాసుధారసవచోవ్యాపార మాప్రజ్ఞ యిం
దేవిద్వద్బలభేది కైనఁ గలదే యెంతేనిఁ జింతించినన్. 83

సీ. ధరణి వస్త్రములలో ధవళాంబరము మేలు, ఋతువులలో సుమా న్వితము మేలు, సుమములలో శరచ్ఛోభిమల్లిక మేలు, విలుకాండ్ర లో రతివిభుఁడు మేలు, ఘనసారభములలోఁ గస్తూరియే మేలు, కలయస్త్రముల గార్ముకంబు మేలు, తనరువాక్కులలోనఁ దర్కవాక్యము మేలు, సారసముఖులలో శ్యామ మేలు

తే. ప్రాయములలోన యౌవనావస్థ మేలు, పరఁగుపదవులలో
విష్ణుపదవి మేలు, మహితగీతులలోఁ బంచమలయ
మేలు, కవులలో నెల్ల బిల్హణకవియ మేలు. 84

చ. మృగములలోన సింహ మవనీంద్రులలో రఘురామమూర్తి ప
న్నగములలోన శేషుఁడు వనములలోపల నందనము దే

పగణములోన శంకరుఁడు వార్ధులలోనఁ బయోబ్ధి యెట్టులో
మిగులఁ గవీంద్రసంతతిని మేటియ బిల్హణుఁ డట్లు చూడఁగన్. 85

అనిన విని వారల బహూకరించి యథాస్థానంబుల కనిచి మంత్రివసు
నితో ని ట్లనియె. 86

రాజు బిల్హణకవినిఁ బిలిపించుట.

ఉ. ఆకవిరాజరాజమణి నాదర మొప్పఁగఁ బిల్వఁ బంపుమా
యాకవితాచమత్కృతివిహారముఁ జూతము మత్కుమారి క
స్తోకముగాఁ గవిత్వవిధి చొప్పడఁ జేయుద మంచుఁ బల్కఁ గా
నాకడ మంత్రి సజ్జనుల నంచిన వారను బోయి యచ్చటన్. 87

సీ. ఒకచెంత వేదాంత మూహించి ప్రకటించు, నొకయెడ మణిసార
మొగి వచించు, నొకచోట వరనాటకకలాపము రచించు, నొకచక్క
ఘనఫక్కికోక్తిఁ దెలుపు, నొకయెడ శృంగారయుతకావ్యములఁ
జూపు, నొకసీమ నురుసామ మూని పలుకు, నొకదండ స్వరమండల
కలగానముఁ బేర్చు, నొకక్రేవ బహుభావయుక్తి నెఱపు

తే. నొక్కతలమున మీమాంస యొక్కదారి, వ్యాకరణపార
మొకెడ నలఘులత్తు, ణాద్యలంకారములఁ గోర్కు లమర
నొసఁగు, నట్టిబిల్హణుఁ గాంచిరి హర్ష మొదవ. 88

వ. కాంచి దండప్రణామంబు లాచరించి దీవనలు గైకొని సముచితాస
నంబులం గూర్చుండి కవిశేఖరు నుద్దేశించి. 89

శా. దేవా బిల్హణపండితేంద్ర విను మర్థివ్రాతకల్పద్రుమో
ద్భావుం డామదనాభిరామనాన్నృపుఁ డత్యంతానురక్తిం బ్రతీ
క్షావాంఛన్ మిముఁ దోడి తె మ్మనుచు నాజ్ఞాపించె విచ్చేయుఁడీ
యీవేళం బనియంచుఁ బల్కఁ బలికెన్ హేలాగతిన్ వారితోన్. 90

ఉ. ఏమిప్రయోజనంబు మము నేమిటికిం బిలువంగఁ బంచె నా
భూమివిభుం డుదాత్తమతి భూరిగుణోత్తరులార తెల్పుఁడీ
మే మట కేగుదెంచెదము మీ రన నేమిప్రయోజనంబొ మా
కేమి యెఱుంగవచ్చు నుపాసీయులు పూజ్యులు గారె సత్కవుల్. 91

బిల్హణుండు రాజసభకు వచ్చుట.

వ. అని పల్కినఁ బ్రమోదాయత్తచిత్తుం డై కవిపుంగవుం డమితశిష్యసంఘంబు గొలువ రాజమార్గంబున వచ్చునెడ. 92

ఉ. ఆముఖసత్కళావిభవ మాకనుబొమ్మలయంద మావయో
ధామవిలాస మానయనతామరసాతివిశాలపత్త్రరే
ఖామహితశ్రుతిద్వయవికస్వరకుండలదీప్తగండపా
లీమధురస్మితప్రభలు లేమలు సూచి రదంచితోన్నతిన్. 93

తే. చూచి తల యూఁచి తత్తనూరోచిరోచి, తీమహిమ కాత్మ
మెచ్చి యెంతేఁ బ్రసూన, బాణబాణవిభిన్నసంభ్రాంత
చిత్త, లగుచు నేకాంతములఁ గాంత లతిశయమున. 94

ఉ. ఎవ్వఁడు వీఁడు చక్కఁదన మే మన నెన్నఁ ధుఁ జూడ మెవ్వఁడో
పువ్విలుకాఁడొ యాధనదుపుత్త్రుఁడొ చంద్రుఁడొ యాజయంతుఁడో
యివ్వనితాశిరోమణులహృద్వనముల్ చిగురింపఁ జేయఁగా
జవ్వని యేగుదెంచినవసంతుఁడొ చూడఁగ నాకు నావుడున్. 95

మ. అతివా పూవిలుకాఁ డటం చనియె టీ వజ్రాంశుగం బెద్ది యం
చిత మానిత్తుశరాస మెద్ది మఱియుం జింతింపఁగా వారిల
క్షితతత్తచ్ఛుభలాంఛనంబు లుపలక్షీభూతముల్ గావె నా
మతి నూహింపఁగ వచ్చెనో హరి తగ న్మానుష్యరూపంబునన్. 96

సీ. "రాకాకళాశోభిరాజబింబ" మటంచు,వినుతి సేయఁగఁబోలు వీనిమో
ము, "ప్రత్యూషవికసితాబ్జాతపత్త్రము" లంచు, వీక్షింపఁ దగు
వీనివీక్షణములు, "శ్రీకుమారునిహేమసింహాసనం" బంచు, వెస
నెన్నఁగా నగు వీనియురము, "ఫోన్నమితస్ఫటోద్యత్కాహిపతి"
యంచుఁ, బలుకవచ్చును వీనిబాహుయుగము

తే. తుంటవిలుకాఁడు ముక్కంటికంటిమంట, నంటనను మున్ను
చెడి తమ్మికంటికృపను, మగుడఁ బుట్టుమికి దిగియెనో తగ
నతండు, నకియు గా కున్నఁ గలదె యీచక్కఁదనము. 97

సీ. ఈపురుషోత్తము నెద వసించినపద్మ, కరభాగ్య మే మందుఁ గమల
నయన, యీచతురాస్యోక్తి నెలమిఁ గాంచినశుభ, వాణిప్రౌఢిమఁ

జెప్ప వశమె తరుణి, యీమేటిసర్వజ్ఞు నెనసి యుండెసతి, భూతి
యిం తిం తనఁ బొసఁగ దబల, యీధామనిధిఁ గూడి యిం పొందు
సుచ్ఛాయ, పదవి యెం తని చూతుఁ బద్మగంధి

తే. వినవె యీవనితానవమనసిజాతుఁ, గూడి క్రీడించు
తరుణులకోర్కు లెల్ల, సఫల మగు వీనిసంగతి సలుపనట్టి,
వెలఁదిజన్మంబు ధారుణి వృథయ కాదె. 98

వ. అని యిట్లు వర్ణింపుచుండ బిల్హణుండు నిజాననసుధాకరప్రభాజాలమ్ములఁదత్రత్యజనవిలోకనసందోహమ్ములుచకోరికాబృందమ్ములుగాఁగమత్తేభంబుచాడ్పున మందగమనంబునవచ్చివిద్వజ్జనమంత్రిపురోహితామాత్యభృత్యవర్గంబుతోఁ దగురాజేంద్రునివలనఁ బ్రత్యుత్థానాభివందనంబులు గైకొని సముచితాసనంబున సథివసించి యాశీర్వాదపూర్వకంబుగా వేదవేదాంతాదిశాస్త్రంబు లుపన్యసించి ఫలసహితంబుగా మంత్రాక్షత లొసంగి మఱియును. 99

క. కవితాప్రసంగ మెంతయు, నవిరళగతిఁ గొంత
సేసి యచ్చట విద్వ, త్కవివరులచేత మెచ్చులు,
నవనీపతి హర్ష మొంద నందెఁ బేర్కన్. 100

క. గురుకవిభాషితయుత మై, సురరాజసభాస్థలంబు
చూడ్కి౯ దద్భా, వసనసభాస్థలి విబుధా,
కర మై పర మై ప్రమోదకర మై తనరెన్. 101

వ. అప్పుడు. 102

తే. రాజరా జైనమదనాభిరాముఁ డలరి, తనదుకంఠస్థ
హారాళిఁ దగ నొసంగి, మఱియు మణిరుచిరాంబర
మహితభూష, ణావళు లొసంగి విడెదికి సనిచెఁ గవిని. 103

వ. అపుడు మిళితజనపరివృతుండై భూవరుండు మంత్రివరునితో నిట్లనియె. 104

చ. మునుఁడు తన్మూవిలాసమును మంజులరో క్షివిశేషయు క్తిచా
తురివు గుసుండు సత్కృతులఁ దోయజనేత్రి తత్కథ విన్నఁ దా

మరసదళేక్షణాల్ గనిన మారశరాహతిఁ గాఁగుచుండు రీ
వరశశిబింబవక్త్రమతిసుందరశోభిత చేతులిన్ గనన్ 105

తే. వినుము జగతికి వరకల్పవృక్ష మితఁడు, వీనిలావణ్య
మనియెడువిరుఁగు త్తి, దనరుతారుణ్యవతులచిత్తంబు
లనెడు, మధుపముల రేఁచి తిగుచు సమ్మతి దలిర్ప. 106

సీ. వీనిమనోహరానూనభావముఁ గాంచి, మే నెఱుంగక పోవు సూనశ
రుఁడు, వీనిభాసురకళావిఖ్యాతిఁ గనుఁగొని, మి న్నందు నెపుడుఁ ద
మీవిభుండు, వీనిసౌందర్యవైభవంబుఁ బరికించి, ఱెప్ప వేయక
చూచు వృషునిసుతుఁడు, వీనిసౌభాగ్యశోభితవృత్తి గని యుత్త
రాశఁ జెలంగు విత్తేశసూనుఁ

తే. డౌర వీనికి దీ సైన్యయతఁడు గలఁడె, వసుధఁ బరికింప
సౌపర్వవనిత లైనఁ, దొడరి మూర్ఛానుగతిఁ జెందుదురు
మనుష్య, కాంత లన నెంత యీతనిఁ గాంచినంత. 107

వ. అని. 108

క. ఈవిధమునఁ బల్కి నపతి, కావిబుధేంద్రుఁడు సుమంత్రి
యనియెఁ నృపవ, ర్యా విద్యాభ్యాసము చెలి,
కేవిధమునఁ బట్టువడుఁ గవీంద్రుఁడు లేమిన్. 109

క. ఇతఁడు వినాగా నెవఁ డీ, క్షితితలమునఁ
గవివరుండు సెప్పుమా యనినఁ, మతిమంతుఁడ
వీవిధమున, శతిచతురోపాయ మొకటి యాత్మఁ దలఁపుమా. 110

వ. అని నృపాలుండు పల్కిన మంత్రి యి ట్లనియె. 111

క. భూవర మీకుం దెలియని, దీవిశ్వమునందుఁ గలదె
యొందును నైనఁ, నే వచియించెద నొక్కటి,
దేవ భవత్కరుణ నాకుఁ దెలిసినయంతన్. 112

మ. ఒకచిత్రవ్రత మున్న దిర్వురకు రాజోత్తంస సిద్ధంబుగా
నకలంకాకృతి నైనసీతనయ జాత్యంధుఁ విలోకింప దా
సుకవీంద్రుండును గుప్తగాత్రి నెపుడుం జూడఁ డందు గోరఁ డిం
దుకు నేమో వచియించుటే యొఱిఁగి యుందుర్ మున్ను త
(త్కార్యమున్.

వ. అని మఱియు ని ట్లనియె.

మ. కవిరాజాగ్రణి పుట్టుగు డ్డనుచు నీకంజాక్షికిం జెప్పి యా
కవికిన్ మీసుత కుష్ఠగాత్రి యని వేడ్కం దెల్పి యవ్వారికిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నేర్పుల్ మీఱఁ గా కుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁ డిట్లున్ రాజదేవర్షభా.

క. ఇరువురినడుమను నొకతెరఁ, దిరముగఁ గట్టించి
చదువు దృఢతరమతిఁ జొ, ప్పరయఁగ మనకన్యక నే,
మఱకయ చదివింత మయ్య మనుజాధీశా. 116

వ. అనిన విని సంతోషితస్వాంతుం డై భూకాంతుండు. 117

క. ఓమంత్రి యెంతవాఁడవు, నీమహిమ నుతింపఁ
దరమె నిర్మలగుణ నీ, వే మంటి వేమి చెప్పితి,
వామాటలయట్ల చేఁత యది మేలు గదా, 118

వ. అని యంతఃపురంబుఁ బ్రవేశించి. 119

చ. జలరుహపాణి వారిధరచారుమనోహరవేణిఁ గాంచనో
జ్జ్వలరుచిగాత్ర నీలజలజాతదళాయతనేత్ర నంతిక
స్థలమున నున్నదాని సుమసాయకుమానినిఁ బోలునాత్మజన్
నెలకొని కాంచి ముద్దుఁగొని నెమ్మి దలిర్పఁగఁ దండ్రి యిట్లనున్.

రాజు తనకూఁతుతో బిల్హణుం డంధుం డని చెప్పుట.

క. నాగర్భజలధిరత్నమ, నీగో మీక్షించునాఁడ
నీ కెప్పుడు నే, రాగంబున సాహిత్యము,
బాగుగఁ జెప్పింతు ననుచుఁ బలికితి ననుమీ 121

క. సంగీతవారిధికి సా, రంగధ్వజరేఖ
వగుచు రాజితకవితా, సంగతి లేక చెలంగుట,
భంగంబు గదా తలంప భావములోనన్. 12[illegible]

క. సంగీతవిద్య కెలమిన్, సంగడి సాహిత్యవిద్య
సరిగా రెండున్, మంగళవతి కలిగిన నా,
సంగతి వచియింపఁ దరమె సాహిత్యనిధీ. 12[illegible]

క. మనపట్టణమున విద్యా, ఘనయజ్ఞుఁడు గలఁ
డొకండు బిల్హణసంజ్ఞుం, డనుకవి జాత్యంధుం డా,
తనిచెంగటఁ జదువవలయుఁ దత్పరమతి వై. 124

వ. అనిన విని. 125

ఆ. అయ్యా నేను జూడ నాకవియొద్దను, జదువు లెల్ల నెటులు
చదువుకొందు, నంధకాననంబు నాలోకనము సేయ,
నని వ్రతంబు నాకు జనక గలదు. 126

క. అంధకునిఁ బాండురోగిని, బాంధవదూషకుని షండుఁ
బాపాత్ముని దు, ర్గంధయుతుఁ గుష్ఠరోగి న,
సుంధర దర్శింపరాదు శుభగుణచరితా.

వ. అనినఁ గుమారికారత్నంబునకు జనకుం డి ట్లనియె. 127

క. పట్టీ యీలాగం దురె, యెట్టైనను విద్య
నేర్పు నెంతో బాగా, గట్టిగ మీయిరువురకును,
గట్టించెదఁ గాండపటముఁ గనరాకుండన్. 128

వ. అని యొడంబఱిచి మఱునాఁడు సమయోచితకృత్యంబులు దీర్చి
సకలమణిభూషణాంబరభూషితుం డై కక్ష్యాంతరంబులు గడచి యెడనె
డఁ బుడమిజేజేలదీవనలు గై కొనుచు బహుదిననివసితదేశాధీశులమ
నవులు సముచితజనులవలన వినుచుఁ గొందఱు సుందరులు ముందర
బారు లై కైవారంబులు సేయఁ గొందఱు కంజాతపాణులు మంజులగతి
వింజామరలు వీవఁ గొందఱు కీరవాణులు చేరి పరాకులు గావింప నొక్క క
ర్పూరగంధి కపురంపుబాగాలొసఁగ మిగుల నందియ్యనందియలు మ్రో
య నొక్క మందయాన యందంబు గాఁ జంపవాదు లోనంగ సంగతి వహ
డిగంపుఁ జెలు లిట్లు సముచిత ప్రకారంబుల గొలిచి రా మందగమ
నంబున వచ్చి రాజితకమలాకరంబుచందంబున సందం బగుచు రాజ్యల
క్ష్మీలక్షితం బై నయాస్థానమంటపంబుఁ జొచ్చి సముచితకాంచనాంబు
జమధ్యంబున నధివసించు రాజహంసంబుసొంపునఁ గాంచనసింహాసనం
బున రాజహంసంబు విబుధగణపరివృతుం డై మహేంద్రుం డగుచు
సదాసవసత్పత్రసమన్వితుం డై కువలయాధీశుం డగుచు మహాభోగిపరి

వేష్టితుం డై భూభృద్వతంసుం డగుచు రాజరాజకుమారసేవితుం డై రాజశేఖరుం డగుచు సముచితభాషాసమన్వితుం డై చతురాననుం డగుచు సుమనఃప్రసన్నుం డై పురుషోత్తముం డగుచు సభంగు లైనవాహినీశులును నపుణ్యజనబాధకు లైనసుమనోవల్లభులును నప్రమత్తు లైనశ్రీకరులును నచంచలు లైనమహాబలులును నవనశాలు లైనప్రచేతసులును ననంతకు లైనసమవర్తులును ననుగ్రసహితు లైనధనాధిపతులును గొలువఁ గొలువుండి మంత్రివరునితో ని ట్లనియె. 129

తే. ఓవసంతక రూపమహావసంతుఁ, డగుకళానిధిఁ
బిలిపింపు మాకళాధి,వాసిముఖి కొప్పఁ బలికితి
వాని మీఱు, ననఁగఁ బిలిపించెఁ గవివరు నాతఁ డప్పుడు. 130

క. వచ్చినకవివరుఁ గనుఁగొని, విచ్చేయుఁ డటంచు
నుచితవిధుల నరేంద్రుం, డచ్చుపడఁ బలిపి కొలఁదిగఁ,
ముచ్చటలుం గడపి కుతుకమున ని ట్లనియెన్. 131

ఉ. ఓకవిరాజచంద్ర విను మొక్కటి సెప్పెద మత్కుమారికి
న్నాకకళావిశేషములు చొప్పడఁ జెప్పుచు లక్ష్యలక్షణ
శ్లోకకవిత్వరూఢి కవిలోకము సన్నుతి సేయఁ జెల్వుమా
మాకు గురూత్తముండ వయి మత్కృతసత్కృతిఁ గాంచి వేడుకన్.

రాజు బిల్హణునితోఁ దనకొమార్తె కుష్ఠరోగి యని చెప్పుట.

తే. అయిన నొక్కటి గలదు మదాత్మజాత, కుష్ఠరోగంబునను
గొంత కొదవ యయ్యె, వినయమందు మనీషావి
వేకమందు, గానమందుఁ బ్రవీణ విజ్ఞానహృదయ. 133

వ. అనిన గవిశేఖరుం డి ట్లనియె. 134

క. ఓహో బాగాయెఁ గదా, యూహింపఁగ నెట్లు సెప్ప
నోపుదు విద్యా, వ్యూహంబు కుష్ఠగాత్రిని,
నాహా వీక్షింప రాదు హరివంశమణీ. 135

వ. అది యె ట్లం టేని. 136

క. వ్రతమొకటి కలదు మా కిల, శ్రుతిహీనునిఁ గుష్ఠరోగిఁ
జూడ నటంచుఁ, మతి సంశయింప నేటికి,
ద్రుతముగ మముఁ బంపుమయ్య రూఢవిచారా. 137

వ. అనిన విని రాజేంద్రుం డిట్లనియె. 138

క. దానికి నొక్కటి చెప్పెదఁ, గానియెడఁ నడుమఁ
బటముఁ గట్టించెద స, న్మానము గైకొని విద్యా,
దానము సేయంగవలయు దాక్షిణ్యనిధీ. 139

ఉ. అందుకు బిల్హణుండు వినయంబు నయంబు మనంబు నొంద రా
జేంద్రునిఁ జూచి పల్కె వసుధేశ్వర మీమన సట్లు యుండఁగా
నిందుల కేమి యందు భవదీయవచోగతి మీఱ రాదు మే
లొందఁగఁ దోఁచినట్లు సతి కొప్పుగఁ జెప్పెద విద్య నేర్పునన్. 140

వ. అనిన విని స్రగ్గంధకుసుమతాంబూలాదిప్రదానంబుల సంతుష్టుఁ
గావించి పుచ్చి దరహసితవదనుఁడై యిష్టసఖునితో. 141

తే. నీయుపాయము బాగాయె నీతివేది, యనుచు భూషించి తత్క్షణంబున
నిమిత్త, కోవిదులఁ బిల్వఁ బంచి యక్కువలయేశుఁ,
డనియె శుభలగ్న మీక్షింపుఁ డనుచుఁ బ్రీతి. 142

వ. ఇట్లు ముహూర్త నిర్ణయంబుఁ జేసి గృహకారుల రావించి వివిధవిచి
త్రంబుగా విద్యాశాల యొకటి రచియింపం జేసి. 143

విద్యారంభము.

తే. అప్పుడు మదనాభిరామనృపాగ్రగణ్యుఁ, డతుల మైనట్టి
శుభదినమందు హితుల, బాంధవుల మంత్రిహితులను
బండితులను, వరుస రావించి బిల్హణకవినిఁ బిలిచి. 144

క. తనకూర్మితనయ నధిపతి, తనరఁగ రావింప వెంటఁ
దవిలి సదాళుల్, గని యామోదమునను రా,
సనయంబున వచ్చి పటముచాటున నిలిచెన్. 145

వ. అప్పుడు పురోహితులు పుణ్యాహవాచనంబు లాచరించినఁ దదనంత
రంబ. 146

తే. మొదట విఘ్నేశ్వరుని వాణిఁ బూజచేసి, బాలరామాయణమునను
బద్య మొక్కఁ, డర్థయుక్తిత నారంభ మద్గిఁ గఱపి, ప్రేమఁ జెప్పంగఁ
దొడఁగె నాబిల్హణుండు. 147

వ. అప్పు డప్పుడమిఱేఁడు సమస్తవిద్వజ్జనభూసురాదిబాంధవులకు భోజనం
బులు గావించి మణిమయభూషణవస్త్రమాల్యానులేపనతాంబూలాది
కృత్యంబులం బరితృప్తులం జేసి మఱియును. 148

మ. జననాథాగ్రణి పుత్త్రికిం గవికి నిష్టం బొప్పఁగా నిత్యభో
జనతాంబూలము లంచితాంబరములున్ శయ్యాసనస్రక్సులే
పనముల్ తక్కువ గాక యుండ నమరింపన్ బిల్హణాఖ్యుండు జ
వ్వనికిం గావ్యము లాది సేసి కఱపింపన్ సాఁగె నానాఁటికిన్. 149

క. సరసాలంకారమనో, హరకావ్యము లర్థయుక్తి
మైఁ జెలు వొప్పం, బరఁగ సుశబ్దవిచారము,
వరసాహిత్యంబుఁ దేట పడఁగాఁ దెల్పెన్. 150

తే. జగతి జనములు మెచ్చి యాశ్చర్య మొంది, లలితమున
బిల్హణాఖ్యునివలన సకల, విద్యలు గ్రహించి జలధర
వేణి యొప్పె, నంబు ద్రింగినతప్తలోహంబుకరణి. 151

సీ. వివిధభావవిశేషనవరసంబులయందుఁ, బ్రీతి సలంకారభేదములను
ఛందోవిభేదలక్షణముల వరనాటక, ప్రక్రియల మహాకావ్యము లను
గామప్రదములగు కామశాస్త్రములందు, జ్యోతిషశాస్త్ర సంగీతశాస్త్ర
ముల సభినయకళాకలితమార్గములందు, గణితతత్త్వామరకాండములను

తే. ప్రౌఢ యై మించి శ్లోకార్థభావ మెఱిఁగి, సంస్కృతాఖ్యైకభాషాది
చతుర యగుచు, హితము మీఱఁ గవిత్వ మూహింపఁ దొడఁగె,
యామినీపూర్ణతిలక యంగతిశయమున. 152

## చక్రబంధము.

శా. ధన్యాసింహాభచంద్రకీర్తివరవిద్యావర్ధితార్యక్రమా
గణ్యాగర్వధనంజయాశివదముక్తాకృత్స్నగంకప్రభా
జన్యారాజితభూరిశాత్రవకుభృజ్జాతిప్రభావిక్రమా
మాన్యారాధనత్యాగభోగజయధామాసవ్యభాగ్యోత్తమా. 153

శాలిని. కాండభూభవాసితాంశుకాండభూభవాదిరా
ట్కాండభూభవాబ్జసుప్రకాండకాండభూమరు
త్కాండభూభవాపగోర్మికాండతుండిరాట్సుధా
కాండపాండుభావిభాస్యఖండకీర్తిమండలా. 154

గద్యము. ఇది సీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచి
త్రకాశ్యపసగోత్రపవిత్ర శ్రీమత్పండిపెద్దికృష్ణస్వామిప్రణీతం
బైనబిల్హణోపాఖ్యానంబనుమహాప్రబంధంబునందు

ప్రథమాశ్వాసము.



చ. మనసిజచోరకుండు తరిమాటున మ్రాఁజిగురాకు బాకు చే
కొని మెయి డాఁచి వేగఁ దమి గొల్పి శశింబయిఁ గాపు వెట్టి తా
నెనయఁగ ధైర్యభిత్తిఁ బెకలించి సమీరపుమచ్చుఁ జల్లి చ
య్యన హరియించి మించెఁ బ్రమదాంచితమానధనంబు లెంతయున్.

చ. మరుఁ డనుసోమయాజి వనమధ్యమునందు ద్విజాళిమంత్రముల్
కరముఁ బఠింపఁగా శిఖి ప్రకాశిలఁ గాంచి మరుద్గణంబు ల
వ్వరుస భజించి రాజున కవార్యశుభోన్నతిఁ జెందఁ జేసె నా
పరమమతిన్ వియుక్తపశుబంధము మాధవుఁ బ్రీతి సేయుచున్. 8

సీ. మాకందములనీడ మాకందములు చూడఁ, జేకొమ్మ యోకొమ్మ చి
గురుఁగొమ్మ, గోరంట డాయవే గోరంట రాయవే, యీచాయ నే
చాయ నింపుఁ జేయఁ, దిలకంబు మానినీతిలకంబ పూని నీ, చేయాన
నీయాన చెలఁగుఁ గానఁ, బున్నాగములక్రిందఁ బున్నాగములఁ జెం
ద, నాసొంపు రతిపెంపునందగింపు

తే. నిట్లు ప్రమదలు సఖులతో నెనసి మనసి, జాతదీపిత
హృదయలై సంతసమున, సరసవనకేళికామహో
త్సవము లలర, వెలయుచుందురు మధుమాసవేళలందు. 9

సీ. ఘనరసాలంబుఁ గైకొనియెఁ గోకిలవాణి, పదరి పోఁబోకువే పల్లవో
ష్ఠి,యనుపమసరసిఁ దానాఁగెఁ జక్రస్తని, మేలని కదియకే మీనసే
త్ర,చిగురించుబలుకొమ్మఁ జెందెఁ గుంజరయాన,చేరఁ జూడకునే రం
భోరుయుగళి,కదళీకాతరు పండెఁ గప్పూరవరగంధి, కూడకే లికుచవ
క్షోజకుంభ

తే. యనుచు నొకబోటి యదలింప నతివ గొనద, రామలార
చంద్రాస్యలార హరిమధ్య, లార సురభిళనిశ్వాసలార పలుకు,
మానుఁ దపింబుంచు దిగు లొందు మాయు సనియు. 10

సీ. బింబోష్ఠి చిలుకలఁ బిలిచి ముద్దాడంగ, సాంకవగంధి మెచ్చకర్ణయ
కసరె, జలరుహచరణ హంసల గారవింపంగ, ఘనవేణి రొప్పఁచుఁ
గడకు నొత్తె, గుసుమాంగి యళులఁ జేకొని తేనె లియ్యంగఁ, గాఢ
చవనాన తప్పించి తఱిమెఁ, గిసలయపాణి కోకిలములఁ బలికింప
తాపమాభిరామ యూరకయ యని పెఁ

తే. బలుకులను యానముల ముంగురులను గీత, ములను లేఁదోఁట
నరయుచు వెలఁదు లిట్లు, మరునిబలములఁ గొందఱు
మరులు గొలుపఁ, గొంద అవి చూచి నిరసింతు రంద మలర. 11

వ. మఱియును. 12

సీ. కలికి చిల్కలకొల్కి ఫలములఁ గోయవే, కోకిలవాణి చిగుళ్లు దేవె
దీటుగా నలివేణి తేనియల్ కూర్పవే, పావనచరిత పుష్పములు దేవె
కలహంసగమన మేల్ జలములానించవే, చంద్రాననసుధారసంబు దేవె
పాటలాధర వేగ వీటి ఘటింపవే, భర్మోపమాంగి దీపంబు దేవె

తే. యనుచుఁ దమలోనఁ జెలులు సయ్యాటములను,
సరసవనకేళికామహోత్సవము మెఱసి, యసమశరదేవుఁ
బూజింతు రంద మలర, సారమధువేళఁ గాసారతీరములను. 13

తే. ప్రకటితాగమవాసనా ప్రథితము లయి, విమలకాసార
గౌరవవిభవ మంది, లలిత మైనవసంతకాలమునఁ
గాన, నములు చెలువొందె నాకాననములకరణి. 14

మ. సకియా కొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్ సల్ప హా
లికుచంబుల్ ఫలసంగతిన్ వెలయునాలీలాగతుల్ గంటివే
సకియా కొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్ సల్ప హా
లికుచంబుల్ ఫలసంగతి న్వెలయుట ల్చిత్రంబె యూహింపఁగన్. 15

ఉ. రాగముతో సదాళి తనరం బొది సేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమనస్థ్సితి నున్నది చూడు మన్న హా
రాగముతో సదాళి తనరం బొది సేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమనస్థ్సితి నుండుట చిత్రమే చెలీ. 16

సీ. చిగురాకు లవి యేల చీల్చెదరే వన, ప్రియచయాశాప్తి హరింప రా
దు, బిసకాండముల నేల విఱిచెదరే హంస, జీవనచ్ఛేదంబుఁ జేయ
రాదు, మకరందముల నేల మాపెదరే సదా, ళినిరాకరణవృత్తిఁ బె
నుప రాదు, కువలయంబుల నేల కూల్చెదరే ద్విజ, రాజసంప్రీతి నా
ర్పంగ రాదు

తే. అనుచుఁ గొందఱు సుందరు లంది మలర, పసుల సర
ములఁ గ్రీడించు చనుదినంబు, సరసవాక్ప్రౌఢిఁ జూపుచుఁ
జతురు లగుచు, వెలయుచుందురు మధుమాసవేళలందు. 17

వ. మఱియు నవ్వసంతసమయంబునం గాంత లింతిం తనరానిసం
తసంబుల సంతతతంత్స్యమానతరుసంతాననితాంతకాంతంబు లగుల
తాంతంబుల నిరంతరపరిమళవంతంబు లగుట బంతులు గొనుతేఁటు
లరంతులకు నలంతిఁ గొనుచింతల నత్యంతసుమరసదంతురాంతరంబు
లగుకిసలయవనాంతరంబుల కిరిగి తదంతరంబుల వంతులు మీఱ నేవం
తులు గోయుచుఁ బూబంతులు గట్టుచు నెంతయు వింత లగుకంతుని
చికిలికుంతంబు లన మంతు కెక్కు శశకాంతపటుల వింత గొని దొంత
ర లగుకలికాసంతతులఁ గాంతిమంతంబు లై పాంతంబుల నలరువాసం
తికావంతనిశాంతంబుల నునికిసంబులు మెఱయ రతికాంతవిజయో
దంతంబు లగుపంతంబు లాడుచుఁ గొంతతడవు తోడి యింతు
లఁ గిసుటించుచు నిగనిగనిపగడములవగఁ దెగడునాగరుతోగరుపొగ
రుచిగుములఁ గేరక యధరముల కెగిరి పగ గొనుమగకోయిలలతెగ
తెగల నొగు తెగయ పగపడక బుగులు బుగులుగొని మొగముల సొ
గసుఁజిలుకుపగవులఁ దగ నగునే యనుచుఁ జగుల మిగుల నాగలి నగ
మగుచు బులుఁగులకు సరి గనుపడ మగిడి నగిగమనిజలుఁగునగరుపులు
యికలు బిగి వగుల నిగిడి పొంకంబు లగుబింకపుఁజన్నులసెలవంకల
నింకక వెడలి యకళంకలోహితాంకురంబు లగుసంకుచితసంకుమద
కుంకుమపంకంబులు జాఱఁ బంకజరసంబులు దొలంకుకొలంకులఁ
జేనియవంకల నిసువంకల నలంకరించులంక లగుకంకేళివనాంగణవి
టంకంబుల మీనాంకధనుష్టంకారశంకాకరంబు లై సుం గడలినగొ
రువంకపలుకులకుఁ గొంకుచు జంకెనచూపు లకలంకరత్నాంకితతా
టంకసముల్లసితలం కెలు గొనఁ గింకరిజనసంఘాతంబుల వంకలఁ ద
లంగి నిలుపుచు నుద్గంధ యురవింద గంధతుందిలమందానిలసందో
హంబులఁ గంధ్ఫలితకుందచందనమందారబృందాన్వితంబు లై కురు
విందమణిసందీపితంబు లగు కెందలిరుచెందురకావిచందువల నొంది
మకరందబిందుబృందంబులపొందునఁ జెందునందంపుగురివెందపంక్తి

కులయందు నానందంపుఁజిందులు గొనునిందిందిరసందోహంబులసం
దడు లేచి క్రందుకొన చెందంబులు గొందలపడ నిందిరకు మందిరం
బు లగుకెందమ్ములకంమవలకుఁ బంచెమ్ములు సలుచుచు నందఱుఁ
బిఱుఁదుల డిందఁ గొంపఱు ముందఱ నరిగి యిందిందిరముఖరితా
ళిందమ్ము లగుకందర్పవిజయమాకందమ్ములక్రిందఁ బిఱుందులు చలిం
ప నందియలు మొరయఁ గుందనంపుసందిబొందియలు చందోయి
నొరయఁ జిందులు ద్రొక్కుచుఁ గందుకకేళిం దేలుచు నిట్లు విహ
రింపుచుండ ఫలపరిపాకసౌభాగ్యసంపన్నశుకసంభాషణం బై భాగవ
తంబుకరణి, వసుమతీజాతాభిరామం బై రామాయణంబుపగిది, నాగా
ఢహారికుమారబాణాసనం బయి భారతంబువైఖరి, నామోదితసుమ
నోవిసరం బై యింద్రనగరంబుబాగున, స్నేహీభూతగంధవాహం బై
ధనంజయనివాసంబుపోలికఁ జక్రాంగపాళికాసరస్ఫురితం బై దండ
ధరునిలయంబుభాతి, భాసితపలాశం బై నైరృతినిశాంతంబుచందం
బున, ననుగతరసవిలసితం బై వరుణమందిరంబురీతి, సముదితగంధబం
ధురం బై పవనునిభవనంబుకైవడి విలసితకుందం బై రాజరాజని
కేతనంబుచాడ్పునఁ, గందళితమహాపర్ణాభిశోభితం బై కైలాసంబుతీరు
న, జాతిరహితం బై యభేదబ్రహ్మంబుచెలువున, నఖిలద్విజసూక్తి
గ్రాహ్యం బై మాధవునియందంబున, శుకముఖవనప్రియచయంబుల
కు నిష్టఫలంబు లొసంగుచు సకలవిధకుసుమాకరం బై కుసుమాక
రం బొప్పుచున్నసమయంబున. 18

సూర్యాస్తమయవర్ణనము.

సీ. కరినాథుఁ బట్టునక్రంబుపై విడిచిన, సరసిజాక్షునిచేతిచక్ర మనఁగ
వరుణదిక్సతికి వాసవుఁ డనురక్తిఁ, బంపినకెంబువ్వుబంతి యనఁగ
నపరశైలాంతహర్మ్యాగ్రజాలాంతరా, ర్పితమహాదర్పణబింబ మనఁగ
భువనాధిపతి నిజపురమందు బిరుదుగాఁ, వల నొప్ప నెత్తినధ్వజ మనంగ

తే. నభ్రసుందరి సుగుణరత్నాకరునకు, మేలు గలుగంగ
బలురతనాలు గూర్చి, పట్టి త్రిప్పెడియారతిపళ్లె
మనఁగఁ, గమలమిత్రుఁడు చరమభాగమున నొప్పె. 19

మ. ఎనయర్క సత్ప్రతి యంతరీపమునను౦ ఢీకొంచి యే మెంచునో
యనుశంకం గడు భీతిచే ఖరకరుం డబ్ధిం బ్రవేశించెనో
యన నస్తాలయవాటికిం జనియె నుష్ణాంశుండు తత్పీడ యొ
య్యనఁ దప్పెం గద యంచు సక్కవలయం బానందముం జెందఁగన్.

ఉ. వారుణదిగ్వధూటి నిజవాటికిఁ బ్రేమ నినుండు రాఁగఁ దా
భూరిముదంబునం బొదలి భూరిమణీగణభూషణాలి కెం
పారెడుపట్టుచీర మెయి నంట ఘటించి కుచద్వయంబునన్
గూరిమికుంకుమం బలఁదెనో యన సాంధ్యము దోఁచె నయ్యెడన్.

క. ఇనుఁ డరిగె ననుచు సమయాం, గన నీలపటంబుఁ
దాల్చి గలయాశల మే, కొని యెడుజారిణికై
వడి, నన దిక్కులఁ దమము నిండె నతిబహుళం బై. 22

చ. అపరవధూటికామణికి నై యతిమోహముఁ జెంది రాజు చొ
క్కపుసిరి గల్గుమంత్రఘుటికాతతి విచ్చినపూలుఁ గొన్ని యం
దపుఁగపురంపుఁబూసలు ముదంబున వశ్యతఁ గూర్పఁ బంచె నా
నపుడు సరోజజాండమున నంతట బారులు దీరెఁ దారకల్. 23

చ. మరుఁ డనుభూమిపాలునకు మాపటివేళల దిక్పురంధ్రులున్
విరులును లాజలుం గలిపి వేడుక సేసలు సల్లిరో యనన్
సరవి నభఃప్రదేశ మనుసౌధమునం బొసరించుదివ్యసుం
దరతరవజ్రపాళిక లనం దగెఁ జుక్కలు పిక్కటిల్లగన్. 24

చంద్రోదయవర్ణనము.

మ. కుముదంబుల్ వికసింపఁ గోకములు సంకోచింపఁగాఁ గాముకా
ళిమనంబుల్ దిలకింప నల్దెసలుఁ దెల్వొం జెంది రాణింప న
క్కమలంబుల్ ముకుళింప వెన్నెలలు వేడ్కన్నింట సూచింప సం
తమసంబు న్నశియింపఁ జిత్తినులచిత్తంబుల్ విజృంభింపఁగన్. 25

చ. తొలిదెస కెంపు నొంద నయుతు ల్బయ మందఁ బయోధి పొంగఁ ద
మ్ములు మొగుడంగఁ గల్వలు ప్రమోదము నింపఁ గవల్బలింప మి
న్నొలయఁ దమిస్రముం బొలియ వెన్నెలపుల్గులుఁ జేరఁ బారుఁ డ
గ్గలముయి మింటఁజందురుఁడు కాంతులఁజల్లుచుఁదోఁచెనెంతయున్.

తే. మదనుఁ డిగురాకుతూపులు పదను వెట్టు, కిళులఁ దేజ
ఃశాణచక్రం బనంగఁ, దామసీసతికర్ణావతంసమనఁగ,
నుదయగిరిఁ జంద్రమండలం బుదిత మయ్యె. 27

యామినీపూర్ణతిలక యుద్యానవనంబున విహరించుట.

వ. ఆసమయంబున యామినీపూర్ణతిలక యనుగతసఖాళీతిలక యై ప్రొద్దు వోక నిదుర రాక లేచి కేల్ సాచి నల్దెసలం జూచి దండ నుండు నొక్క వేదండయానపైఁ గేదండ యిడి మందగమనంబున బృందారకసుందరీసందోహమ్ముఁ దుమఁ గడు నొడ్డై నందనవనంబునకుం దరలు పురందరారవిందవదనచందంబున నందంబయియుద్యానవనసమీక్షణోద్యోగయై చని యచ్చట నచ్చపుఁబచ్చరాల మెచ్చగుతిన్నెల వెన్నెలపాడలు గడలుకొనఁ జివురుజొంపంబులసొం పొందినమాకందంబులచెంతఁ గొంతసేపు విశ్రమించి తదాశ్రితవనితాజనతాకల్పితఫలకుసుమాద్యుపధానంబులహర్షంబు నొంది యవ్వలఁ జని జవ్వనులం బిలుచుచు నవ్వానిఁ గలయందివుగుచు మంజుతరకుంజంబు లరయుచు నంబుయంత్రంబులఁ జూచుచు పాదులు గట్టి బోదులు చేసి సమల్లికావల్లికాదుల నవలోకింపుచు నింపులు మెఱయ సంపెఁగలు గోయుచు సొంపు సంపాదింప సాలంబుల లోలంబు లగుశిఖాజాలంబుల నయ్యాటంబుల నొయ్యనొయ్యన నుయ్యాల లూఁగుచు బాగు మీఱి సనికటతటినీతటనివసితసికతాతలంబులఁ గప్పురగంధులతోడ నొప్పఁగఁ గప్పారంపుఁదప్పల మొగమ్ముల గప్పి వెన్నెలకుప్ప లాడుచుఁ దప్పినఁ జప్పటు లప్పళింపుచు నొకరొకరిం గికురించుచు నాటలఁ బాటలఁ బూఁబోటుల నిట్లు విహరించుచు. 28

అలివేణిరో మన కామోదంబులు, గలయఁగఁ జేయుచుఁగల నాదంబులు
పెంపు దలిర్పఁగఁ బికవారంబులు, గుంపులు గొని పల్కుచుఁ గీరంబులు
జా లగు తేఁటులఝుంకారంబులు, నోలిగ శాకహుంకారంబులు
పరగఁగ నొప్పెడుపాటీరంబులు, మెఱయుచు నుండెడుమేటీరంబులు
సడలు నెప్పుడుఁ గుసుమాసారంబులు, గడు వడిఁ బోకు రకాసారంబులు
గలిగినచోటికిఁ గదలుఁడి తావులు, గలిగినఁ జాలును గపురపుదీవులు
చూడరె యెంతయుసొం పైయున్నది, పోఁడిమిఁ జెప్పఁగ మునుపే కన్నది

కంటే తక్కువ గాదా వాటికి, నంటివె పోదము యావనవాటికి
పదరే పోదము పదుగుర మిప్పుడు, పదరక పోవలె బలు కాల్ చప్పుడు
వినిన బెగడి పోవే రాయంచలు, పనివడి నే ర్పేర్పడగాఁ జంచులు
చాటు చేసికొని చనరే యింతులు, మాటలాడకురె మఱి మీఱంతులు
ఎక్కడ వచ్చిన నే మన మీారలు, అక్కరో వింటివె యది మీావారలు
సేయఁగ నన్ననఁ జెలువే నీకును, బోయెద నుండవె పాలతిరొ నాకును
బని యే మున్నది పలుకే మంచిది, మన లేదా నీమాటలనంచిది
తేటగ మన మీా తేనియవంకలు, దాఁటఁగఁ దరమే తలఁపున శంకలు
మానరె చూచిన మంచిది వెన్నెల, కానికాని మఱి కపురపుఁదిన్నెలఁ
దరువులనీడల దాఁగిలిమూఁతలు, పరఁగ నాడుదము పదుగురు నాతులు
రారే నేనీరమణిని ముట్టితిఁ, గోరికి మీఱఁగఁ గొమ్మను బట్టితి
బంతు లాడుదము వంతులు గట్టుక, చెంతకు రమ్మా చెలిఁ జేపట్టుక
పువ్వులఁ గోయుద మివ్వనితావుల, దవ్వా పోదము తనరెడు తావుల
కి మ్మైన్మె యున్నవి యివిగో పువ్వులు, ఇమ్మహి రాలిన వేరరె పువ్వులు
గాడిగ వెన్నెల గాయగఁ దరువుల, నీడలఁ బోడ వెన్నెల లీయిరువుల
కేతెంతము మఱి యిందఱు ముదమున, నాతత కేళులననుగత వనమున
నాడుచుఁ బాడుచు నతివలు ఘనముగ, వేడుక చేసిరి పెక్కువిధములుగ

క. అందలసి సొలసి రాజపు, దందరకన్యాలలామ
రమణులు వేడ్కం, జెంది యుపచారములు సే,
యం దగ శయనించె సుమకృతాంచితశయ్యన్. ౩౦

తే. అట్లు శయనించి కూరుకు నంది యంత, నంతలో లేచి
వివశాత్మ యై కలంగి, తెలిసి కను మూసి క్రమ్మరఁ దెలివిఁ
గాంచి, కాంచి దిక్కులఁ జెలులను గాంచి కాంచి. 31

తే. మగిడి శయనించి మఱి లేచి మై విదిర్చి, మదినిఁ దలపోసి
తలపోసి మఱునిగాసి, కిని భరింపఁగ లేక మూర్ఛన
యఁ జిక్కి, పల్క నేరక యున్న నప్పుడంతు లెల్ల. 32

ఇది యేమిఖింత యిచ్చట, నిదురించెను లేచి
లేచి నెఱి మనలను జూ, డదు మాటలాడ దెం
తయు, నిది యేమొ తెలియ నేర మే మంద మయో. 33

వ. అని యిట్లు తమలోఁ దాము వితర్కించి చుట్టు ముట్టి రాపట్టినిట్టుఁ
బట్టి యట్టె దాని మొగంబుఁ గనుఁగొని యొక్కసఖి యి ట్లనియె.

క. ఓయమ్మ యేమి యిది నీ, కీయెడ మముఁ
జూచి పల్క వేమీ యిపుడున్, డాయవు
కారణ మేమీ, పాయనిదయతోడఁ జూచి పల్కుము తన్వీ. 35

చ. అన విని చాలఁ జెప్పిరిలి యాసఖిఁ గన్గొని పల్కె నోసఖి
విను మొకవింత యే మని భువిన్ వచియించెద నైనఁ జెప్పెదన్
వనిఁ జరియించి యిచ్చటికి వచ్చి ముదంబునఁ బువ్వుసెజ్జ నిం
పున శయనించి యుండుతఱిఁ బొందుగఁ గూర్కెడినంతలోపలన్. 36

చ. ఒకకలఁ గంటిఁ గంటి ఘను నొక్కనిఁ జక్కరవింటివానిపో
లికిఁ దనరారువాని నవలీమసకాంతుల నొప్పువాని సం
వికసితసారసాక్షు మఱి విన్నది గన్నది గాన మెవ్వఁడో
సకి యిట వచ్చి నాసరస జాణతనమ్మున నుండె నుండినన్. 27

ఉ. నేనును వానిపై రడుగ నేరక మారకఠోరకార్ముక
జ్యానినదంబు సోఁకి తమి నంది చెవుడ్పడి చూచుచుండ వాఁ
డూనినప్రేమ ఛిన్నఫల మొక్కటి యిచ్చి యదృశ్యుఁ డయ్యెఁ జం
ద్రానన చంద్రుఁ డజ్జలధరాంతర మొందినరీతి సంతటన్. 38

ఉ. తత్తరపాటుఁ జెంది మది తల్లడిలంగను మేలుకొంటి నా
చిత్తజసన్నిభాంగుఁ జెటఁ జెందెనొ సన్నిటఁ గ్రూరుఁ డైనయా
చిత్తజుబారినిం బడఁగఁ జేసె నికం దమిఁ దాళఁ జాల నే
నిత్తఱిఁ బల్కవమ్మ దయ నిందుల కేమి యొనర్తు భామినీ. 39

వ. అనిన శుకవాణి యి ట్లనియె. 40

ఉ. ఈకల మంచిదమ్మ మది నిందుకు సంశయ మొందకమ్మ యా
శ్రీకరగాత్రుదర్శనము చేకుఱునమ్మ శుభావహంబు సు
శ్రీకర మైనపంచు సుతసిద్ధియు నెం గదవమ్మ మేలు మే
లీకల మాకు సమ్మదము హెచ్చెఁ గదమ్మ సుధాకరాననా. 41

వ. అని యిట్లు పలుకుచున్న సమయంబున. 42

సీ. మలయాగముల జాఱి వలయాగములఁ దూఱి, కలయాపగలఁ జేరి
పొలుపు మీఱి, ఘనసారసము లొంది ఘనసారములఁ జెంది, మనసారఁ
జెలు వంది తనువుఁ బొంది, మల్లికానవహేమవల్లికాసుమనోమ, తల్లి
కాయుతసీమ నల్లికఁ గని, కేళికారతిలోలబాలికాసుకపోల, పాలికా
సవలీల మేలు గాంచి

తే. శారికాకీరపరభృతచంచరీక, కలితకలకల
నినదసంకలితచలిత, విరహిజనమానసాంభోజవీథి
యగుచుఁ, గలయ నేతెంచె శీతలగంధవహుఁడు. 43

వ. అట్టిసమయంబున. 44

శా. రాకాశీతమయూఖజాలములు మేరల్ మీఱి మై నిండ ను
ద్రేకాంభోజశరాశుగావళులు లోఁ ద్రిప్పారఁ బాటీరశై
లైకాంచత్పవనంబు పైపయిఁ గడున్ హెచ్చి విజృంభింప ము
క్కాఁకం జెంది సహింపఁ జాలక తమిం గాసిల్లి మూర్ఛిల్లినన్. 45

వ. అచ్చట నున్నసయ్యాళిసందోహంబు హాహాకారంబు లొంది.

ఉ. ఇవ్విని కేల వచ్చితిమి యిందఱమున్ గుమి గూడి వచ్చి యీ
పువ్వులతోఁట నేల సారఁ బూనితి మిప్పుడు పూని యిచ్చటం
గ్రొవ్వున నేల నిల్చితిమి గొబ్బునఁ బోక యటంచు మించుబోం
డ్లవ్వనజాక్షిఁ జూచుచును హా యనుచున్ మది సంభ్రమించుచున్.

చ. కల గనువారలుం గలరు కల్గిన నీకలవంటి దెక్కడేఁ
కలుగునొ కల్గె నివ్విధము గాసిలుచుండెడికాంత లెక్కడేఁ
గలచె వధూటులార యిఁకఁ గార్యము మీఁద వచింపరమ్మ యీ
చలి నిట నుంచఁ గాఁ దగదు చేరుద మింటికి వేగ బాగుగన్. 48

వ. అని యిట్లుచితంబుగా శైత్యోపచారంబులు సలిపి సేద దేర్చియారా
జపుత్త్రినిం దోడ్కొని పోయినయాలోన. 49

బ్రాహ్మణుఁడు చంద్రుని వర్ణించుట.

సీ. సాంధ్యకృత్యము దీర్చి జలిపి యిష్టం బైన, యీశ్వరునకు నమస్కృ
తు లొనర్చి, భుజియించి తావులఁ బోలు పైసచందన, మలఁది పు
వ్వులు దాల్చి హారరాజి, ధరియించి వలువలు ధరియించి తాం

బూల, మును జేయుచును వచ్చి మోద మంది, శయ్యాతలంబున
శయనించి చంద్రునిఁ బరికించి వీక్షించి భావ మలర

తే. నింపుమెయి బిల్హణుండు వర్ణింపఁ దొడఁగె, నిజియు విర
హిణులకుఁ జూడ మదనతాప, మెదఁ బొడమఁ జేయువిత్తనం
బెన్న మఱియు, మనసకు బలంబు వరచంద్రమండలంబు. 50

వ. అని మఱియు ని ట్లనియె. 51

ఉ. కలువల నిద్ర లేపి రతికాంతునిమాంద్యము వాపి పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి రతి చాలనిబాలల నూపి దేవతా
వలి కమృతంబుఁ జేఁపి యలవాసవదిక్సతికుండలంబు నై
కలువలఱేనిమండలము కాంతిలుచున్నది తూర్పుకొండపై. 52

చ. ఇది గగనంబు గాదు నుతియింప సుధావనరాశి గాని మేల్
వదలనితారకానిచయపంక్తులు గా వివి ఫేనఖండముల్
గుదుపగఁ జుట్టుకొన్నవరకుండలి గా కిది చంద్రబింబమా
యిదియును జిహ్న గాదు పవళించినవిష్ణుఁడు గాని యెన్నఁగన్. 53

చ. అరయ నభస్స్థలం బనెడియందపుగందపుసానపై రుచిం
బరఁగినచంద్రబింబ మనుబాగగుచందనరాశి పైపయిన్
నెఱయఁగ వాసనార్థమయి నించినకస్తురిఁ బోలి యొప్పె శ్రీ
కరముగ నీకళంక మనఁగా నను పై విలసిల్లు నెంతయున్. 54

చ. అరయఁగఁ జంద్ర నీయుదరమందలినల్పు వటంబటంచుఁ జా
మరమృగ మంచుఁ బల్కుదురు మానుగఁ గొందఱు నే వచింతుఁ జం
గరిగమనాధరస్థలులఁ గమ్మఁదనంబు ఘటింప ధాత ని
న్నారసి సుధారసంబుఁ గొనెనో యది జాలము నాఁటనుండియున్. 55

చ. జలనిధిపంకి మంచు మహిచాయయుఁ జిహ్నము లేడిపిల్ల కం
దళితసురేంద్రనీలమణిధామ మటంచు వచింతు రందఱే
కలువలఱేనియందుఁ గళంకమును నే ననుకొందు రాత్రియుం
దలవడ మ్రింగినట్టితమ మంతరసంస్థ మటంచు నెంతయున్. 56

ఉ. చందురుఁ డన్నె గాఢపతి శౌర్యవిజృంభణవృత్తిఁ బూని పౌ
రందరదిగ్ధరేంద్రకుహరంబుననుండి పెచుల్ సెలంగఁగా

కందళల కేసు డెంచుచుఁ బమటికరికుంభము స్వాంశు రేఖికా
స్పందనసఖులంబులం జిదుమ పేషీసముత్యము లయ్యెఁ దాంకల్. 57

సీ. ఈకళానిధివల్లనే కదా దిక్కుది, క్కులవార లెల్లను దెలివి గనుట,
యీవసుధనివల్లనే కదా విబుధులు, కోరికల్ దీరంగఁ గుడుపు గను
ట, యీమహావిధువల్లనే కదా సభ్యు లెన్నఁగ నిశాచరు లెల్లఁ ది
గులు గనుట, యీసత్ప్రభునివల్లనే కదా మోదించి, కువలయం బె
చ్చుగాఁ గూర్మి గనుట

తే. అవుర యీరాజుమహిమ యే మనఁగ వచ్చుఁ, దమము
వారించి యురులసంతతి నడంచి, యస్వరతి డించి హారిపన
మాక్రమించి, యుదయగిరిదుర్గమునసుండి యొప్పుచుండె. 58

ఉ. ఈయుదయాద్రి రాజతగిరీశ్వర మీసితభానుఁ డెన్న దా
క్షాయణి నేలుశంకరుఁడు కప్ప గళచ్ఛవి దాపుచుక్క వై
నాయకమూర్తి యా ప్రమథనాథులు దక్కినచుక్కలుక్ మహా
శ్రేయ మొసంగు స్వప్రభచేఁ జెంది భజించువియోగిపాళికిన్. 59

సీ. ద్విజరాజటంచు భావించుటయే కాని, యూఢిగా దోషాకరుండు వీఁ
డు, సన్మార్గరతుఁడంచు జనులు పల్కెడు కాని, దండిమీఁటినవిశాటుం
డు వీఁడు,సమృతకరుం డంచు నాఖ్యమాత్రమె కాని, చర్చింపఁగా వి
షజనుఁడు వీఁడు, కువలయప్రియుఁ డంచుఁ గోరి చెప్పెడు కాని, పా
డి దప్పినచక్రవైరి వీఁడు

తే. తమము వారించురా జన్నక్రమమె కాని, యేపు మీఱఁగ
నారుల నేఁచు వీఁడు, ననుచుఁ గులటలు దూషింతు
రనుచు జనుల, త్రోవ రా వెఱచితో నీవు తోయజారి. 60

క. సురలతెమవు వో సాగితి, వరయఁగ సత్పతి
వదే ని శాటుఁడవా నీ, కిర పొందఁగ విధునామము,
హారి హారి తలపంగఁ జెల్లునా కమలారీ. 61

క. జడనిధికిఁ గూర్మిపట్టివి, జడమతులం బట్టుకొమ్మ
నైదోడవు హా, జడజాతులకు సఖుండవు,
జడాత్ముఁడవు గాక యుండె చందురుమామా. 62

కుచంబుల కేగుదెంచుచుఁ బ్రమదకరికుంభము స్వర్ణాంశు రేఖికా
బృందనఖంబులం జిదుమ విశేషముత్స్యము లయ్యెఁ దాంకల్. 57

సీ. ఈకళానిధివల్లనే కదా దిక్కుది, క్కులవార లెల్లను బలిపి గనుట,
యీవసుధనివల్లనే కదా విబుధులు, కోరికల్ దీరంగఁ గుడుపు గను
ట, యీమహావిధువల్లనే కదా సభ్యు లెస్సఁగ నిశాచరు లెల్లఁ ది
గులు గనుట, యీనక్షత్రభునివల్లనే కదా మోదించి, కువలయం బె
చ్చుగాఁ గూర్మి గనుట

తే. అవుర యీరాజుమహిమ యేమనఁగ వచ్చుఁ, దమము
వారించి యురులసంతతి నడంచి, యస్వరతి డించి శారదవన
మాక్రమించి, యుదయగిరిదుర్గమునునుండి యొప్పుచుండె. 58

ఉ. ఈయుదయాద్రి రాజతగిరీశ్వర మీసితభానుఁ డెన్న దా
క్షాయణి నేలుశంకరుఁడు కప్పు గళచ్ఛవి దాపుచుక్క వై
నాయకమూర్తి యాప్రమథనాథులు దక్కినచుక్కలుక్ మహా
శ్రేయ మొసంగు స్వప్రభచేఁ జెంది భజించువియోగిపాళికిన్. 59

సీ. ద్విజరాజటంచు భావించుటయే కాని, యూఢిగా దోషాకరుండు వీఁ
డు, సన్మార్గరతుఁడంచు జనులు పల్కెడు కాని, దండిమీఱినినిశాటుం
డు వీఁడు,నమృతకరుం డంచు నాఖ్యమాత్రమె కాని, చర్చింపఁగా వి
షజనుఁడు వీఁడు, కువలయప్రియుఁ డంచుఁ గోరి చెప్పెడు కాని, పా
డి దప్పినచక్రవైరి వీఁడు

తే. తమము వారించురా జనుక్రమమె కాని, యేపు మీఱంగ
నారుల నేఁచు వీఁడు, ననుచుఁ గులటలు దూషింతు
రనుచు జనుల, త్రోవ రా వెలచితో నీవు తోయజారి. 60

క. సురలతెమవు వో సాగితి, వరయఁగ సత్పతి
వదే నిశాటుఁడవా నీ, కిర వొందఁగ విధునామము,
హరి హరి తలపంగఁ జెల్లునా కమలారీ. 61

క. జడనిధికిఁ గూర్మిపట్టివి, జడమతులం బట్టుకొమ్మ
నైదోడవు హా, జడజాతులకు సఖుండవు,
జడాత్ముఁడవు గాక యుండె చందురుమామా. 62

తే. తమము వారించు నీదుసందర్శనంబు, నిఖిలజనులకు
మోదంబు నీదుమూర్తి, యిట్టిసంపద గలుగు నీ
యట్టిరాజు, కోరి చూచినఁ గలఁడె యోకువలయేశ. 67

వ. అని యిట్లు బిల్హణుండు చంద్రునిం బేర్కొని బహుప్రకారంబుల
వర్ణించుచున్న యెడ. 68

తే. భోజనము సేసి కొప్పునఁ బూలు దుఱిమి, చందన మలంది
తాంబూల మంది వేడ్కఁ, బొలుపుగా వచ్చి యామినీ
పూర్ణతిలక, యవనికాభ్యంతరమున శయ్యను వసించి. 69

ఉ. ఆకడ నాకవిక్షితివరాధిపుఁ డిందునిఁ గూర్చి నేర్పునన్
వాకొని తద్విశేషములు వర్ణన సేయఁగ నాలకించుచోఁ
దేఁకువ విస్మయాంబునిధిఁ దేలి మనం బలరంగ శంకచేఁ
గోకిలవాణి యి ట్లనియెఁ గూరిమితోఁ దనలోన నేపునన్ 70

క. తమజనకుం డీసత్కవి, నమరఁగ జాత్యంధుఁ డనుచు
నాడి వచించెం, గ్రమ మొప్పఁ జంద్రవర్ణన,
సుమహితముగఁ జేయఁ బోడఁగెఁ జూచినకరణిన్. 71

శా. అంధుం డెక్కడ! చంద్రుఁ డెక్కడఁ! దదీయం బైనయవ్వర్ణనా
బంధం బెక్కడ! నిట్టివింత గలదే! భావింప నెచ్చోట నె
నం ధాత్రీంద్రుఁడు మాకు నిర్వరకు నందం బొప్ప నన్యోన్యహృ
త్సంధానం బగు నంచుఁ జేసె నిటులం జర్చింప వే ఱున్న దే? 72

వ. అని మఱియును. 73

క. వ్రతభంగ మయినఁ గానీ, మతిమంతు నుదాత్త
వేషు మానితవిద్యా, న్వితునిం గాంచెదఁ గన్నుల,
కతులమహోత్సవము గాఁగ నని చెలి ప్రీతిన్. 74

యామినీపూర్ణతిలక కవినిఁ జూచి మూర్ఛిల్లుట.

సీ. వినుతవిద్యాజితద్విజరాజు ద్విజరాజు, రుచిరాజి నగుమోమురుచు
లవాని, రమణీయవాణిభారతికాంతు రతికాంతు, నతికాంతిఁ దెగ
డుసోయగమువాని, నతులితశుచివిభాహరిమిత్రు హరిమిత్రు, వరమైత్రి
గల్గువైభవమువానిఁ, గలితతేజోలసత్కమలాప్తుఁ గమలాప్తుఁ, గమ
లాప్తిమేలయిన చందమువానిని

తే. సకియ మది నెంచి తమి మించి సంభ్రమించి, కరము
లలరించి తెఱ వంచి కందళించి, పొంచి తిలకించి పులకించి
పొలుపు గాంచి, కాంచె రోహిణి చంద్రుని గాంచినట్లు. 75

క. కాంచినయంతనె సతి పుల, కాంచితదంతురిత
దేహ యై నిశితోద్య, త్పంచశరశరవిపాటన,
సంచలితస్వాంత యై వెస, ధృతి దూలన్. 76

తే. పరవశత నొంది మూర్ఛానుభావ యగుచుఁ,
బవనచాలితనిపతితవల్లిమాడ్కిఁ, బంకజాయతలోచన
పడియె మఱియుఁ, బట్టు దప్పినకనకంపుఁబ్రతిమవోలె. 77

ఉ. ఆకడ బిల్హణాఖ్యకవి యత్తఱిఁ దామరసారిఁ గూర్చి యెం
తో కర ముప్పతిల్ల వినుతుల్ పచరింపుచు నుండి యంతలోఁ
బ్రాకటబద్ధకాండపటిపై రమణీమణిమోముఁ జూచి య
స్తోకమహోదయాద్రిపయిఁ దోఁచినచంద్రునిఁ బోల్చి యిట్లనున్. 78

బిల్హణుండు రాజకుమారిని వర్ణించుట.

సీ. రాకేందుబింబమో రాజీవమో మించు, టద్దమో లేక నెమ్ముద్దు
మొగమొ, చెలు వొందుకల్వలో చేఁపలో మరునినా, రాచంబులో
లేక లోచనములో, కోకంబులో విరిగుత్తులో బంగారు, కుండలో
లేక వక్షోజయుగమొ, క్రొక్కారుమెఱుఁగొ మేల్చుక్కయో నునుఁ
బైఁడి, తీఁగయో వేఱొక్క తెఱవయొక్కొ

తే. అప్సర యొకొ యాతావి యారమణత, యావిధంబులు
నీబెళ్కు లీకుశలత, యానువృత్తత యాసొంపు లీమె
ఱుంగు, లీతళుకు లిగ్గు లీచాయ లెందుఁ గలవు. 79

సీ. హరిణిమిత్తశీతాంశుబింబము గాని, పరికింపఁగా నిది ముఖము
గాదు, ఘనసుధాపూర్ణకాంచనకుంభములు గాని, చర్చింప నివి
యురోజములు గావు, పంచశిలీముఖబాణపంక్తులు గాని, గుఱి
మీఱ నివియు ముంగురులు గావు, చెలు వొంద యువజనస్వాంతఖ
ండంబులు గాని, యమరంగ నివి వీక్షణములు గావు

తే. పాలు మించినమించుటద్దాలు గాని, గణుతి గొన నివి
గండభాగములు గావు, సోయగంబైనబంధూక
సుమము గాని, భావమున నెన్నఁగా నిది మోవి గాదు. 80

మ. క్షితి నిర్జుల్ శశిరేఖ విల్లుఁ గలువ ల్చెందమ్మిరే కబ్జముల్
లతికల్ గుంభము లాకసం బిసుకదిన్నల్ రంభలుం గాహళుల్
శతపత్త్రంబులు భావలీలఁ గొని యీచంద్రాస్య ఫాలాక్షుని
ర్జితదేహుల్ శుకరాజవాహు మొలపించె న్మేనఁ జిత్రంబుగన్. 81

మ. ఉరువక్షోజయుగాంతరస్థ మయి నాయుల్లంబు రా దేమి త
ద్భరసంఘృష్టి నశించెనో విరహసంతాపాగ్నిచేఁ గ్రాఁగెనో
స్థిరలావణ్యసుధాంబుజాకరవరాప్తిన్ మున్గెనో కామత
స్కరవీరుండు హరించెనో నవవయఃకాంతారసంచారుఁడై. 82

వ. అని మఱియు ని ట్లనియె. 83

సీ. ఈభామతనుకాంతి నేపారఁ జూచిన, హేమాభిధానంబు నెంచ నేల
నీచానయూరుప్రభాచాకచక్యంబు, రంభాభిరూప్యంబురహి నడంచు
నీరామనవ్యనాసారమ్యలీల తి, లోత్తమాఖ్యను దల నెత్త నీయ
దీకొమ్మకన్నుల నిర వొందు బెళ్కులు, హరిణీవిలాసంబు నపహసించు

తే. నిటుల గాత్రైకదేశము లటమటించు, సౌరవారవధూటికా
సామ్యకలన, మనుజలోకంబునం దుండుమానవతుల,
సంగ నెంత యీ దీని మానంగ వశమె. 84

సీ. చెలియపెన్నెరిగుంపుఁ జేపట్టఁ గలిగెనా, ఘనసంపదలు వేడ్కఁ గాంచిన
ట్లు, కాంతమోమున మోముఁ గదియింపఁ గలిగెనా, యతులితరాజ
త్వ మందినట్లు, ముద్దియకన్దోయి ముద్దాడఁ గల్గెనా, యింపుమైఁ గు
వలయం బేలినట్లు, వనితకంఠాశ్లేష మొనరింపఁ గల్గెనా, యరుదారఁ
బెన్నిధి యబ్బినట్లు

తే. కలికికెమ్మోవి చవి చూడఁ గలిగెనేని, యుగసుధాహార
వైభవం బొందినటుల, నెలఁతతోఁ గూడి క్రీడింపఁ
గలిగెనేని, యతనుసామ్రాజ్య మంతయు నమరినట్లు. 85

ఉ. అందపుఁగౌను శ్రీహరి నహర్నిశమున్ భజియించి తత్పదం
బందె నటంచుఁ జన్గవ తదాకృతిఁ గాంచె గిరీశుఁ గోరి యా
రుం దగఁ జూచి వెంటఁబడి రూఢికి నెక్కుట యెట్లటంచుఁ దాఁ
జెందె సహీనవృత్తి సవిశేషత నివ్వరకుం బ్రియంబుగన్. 86

చ. వనజమహావిభూతి హరివైఖరి మించుఁ బద స్తనోక్తులున్
వనజమహావిభూతి హరివైఖరి మించు గళోరువేణికల్
వనజమహావిభూతి హరివైఖరి నెంచుఁ గరాక్షిమధ్యముల్
వనజమహావిభూతి హరివైఖరి నొంచు దృగాస్యయానముల్. 87

సీ. ఈభామవదనాబ్జ మెలమిఁ గాంచినయంత, విధుని సంభావించి వెలసి
నట్టు, లీచాననెఱికురు లెనసి పట్టినయంత, నీలకంధరసేవ నెగడినట్టు
లీయంబుజాక్షికన్దోయి ముద్దిడునంతఁ, గమలజసద్భాతి గలిగినట్టు
లీరామకెమ్మోవి యింపార నంటిన, సరుణబింబాలోక మమరినట్టు

తే. లవుర తనకింతకంటె భాగ్యంబు గలదె, యతనుమంత్రా
ధిదేవత యనఁగ వచ్చు, నీచెలినిఁ బొందఁ గోర్కె లీ
డేరుఁ గాక, వేఱ మదిఁ బూని తపముఁ గావింప నేల. 88

సీ. సారంగముల మీఱు సారంగములఁ గేరుఁ, దొయ్యలికొప్పు కన్దోయి
యొప్పుఁ, బున్నాగముల నెంచుఁ బున్నాగముల నొంచు, నలినాస్య
గతిసొంపు నాభిపెంపుఁ, జంద్రఖండము నేలుఁ జంద్రఖండముఁ బో
లు, సువతిచెక్కులలాగు నుదుటిబాగుఁ, గాంచనంబు హరించుఁ
గాంచనంబు హసించుఁ, దరళలోచననాస తనువిలాస

తే. మవుర యీముద్దుచెలిఁ బొందినట్టివాని, భాగ్య మెన్నంగ
వశమె యాపద్మభవుఁడు, దీని సృజియించువేళ వాగ్దేవి
నెదుట, నుంచుకొని చేసెఁ గాఁబోలు నొండు గలదె. 89

ఉ. దీనిముఖాంబుజంబు గణుతింపఁ గళానిధి యొక్కకోణమం
దూని వసించుఁ గాక నయనోద్గతి వాకొనఁ గల్వ లొక్కచో
మానుగ నిల్చుఁ గాక మృదుమంజులవాగ్గతిఁ జెప్ప వల్లకీ
స్థాన మటుండుఁ గాక ఘనుచాయకు స్త్రమొక్కెడ మధ్యమెన్నఁగన్.

సీ. ఊహించి పున్నమ యొక్క-పాత్రి ద్దందునో, ముద్దియనెమ్మోము మూ
ద్దులాడఁ, దనరార సత్ఫలదానముల్ సేతునో, నెలఁతకై మోవితేని
యలుగ్రోల, బంగారుకలశముల్ పరఁగఁ బూజింతునో పడఁతిచన్నుబ్బు
లు వట్టియాడఁ, జెలుహొంద భూప్రదక్షిణము గావింతునో, యతివ
కటిస్థలి నధివసింప

తే. నిటులు గాకున్నఁ గల్గునే యింతితోడి, సంగతు లటంచుఁ
దమి మీఱ నంగజాత, జాతతాపాతిశయమున సతిని
మతిని, మమతఁ బెనఁగొని వర్ణించు మఱియు మఱియు. 91

సీ. పొలతిపాదములతోఁ బొందు సేయఁ దలంచి, తామరల్ పరికించి
తమ్ము లయ్యెఁ, గలికిపాలిండ్లతోఁ జెలిమి సల్పఁగఁ గోరి, భావించి
చక్రముల్ పత్తు లయ్యె, సుదతికై మోవితో జోడు గూడఁగఁ బూ
ని, చెలఁగి మంకెన బంధుజీవ మయ్యె, హరిణాక్షినెమ్మోము నాశ్ర
యింపఁగఁ జూచి, మిహిరాంశుఁ డెలమి సన్మిత్రుఁ డయ్యెఁ

తే. జంద్రముఖియంగములు పంకజాతము లని, యహ లని
విహీనగుణి యని భరితదోషుఁ, డని కదియ దూరముగఁ
జేసె నాత్మనిత్య, మృదులసుస్నిగ్ధతాస్మితవిదితకళల. 92

ఉ. పట్టుగ నీవధూటికచపాళి భజింపఁగ నీలమేఘు మే
గుట్టలఁ జెందునో ముఖముఁ గోరి నుతింపఁగఁ బూర్ణచంద్రుఁ డే
తట్టునఁ జేరునో మఱియుఁ దార్కొని యూహ దలంపఁ బాము లే
పుట్టలఁ దూఱునో సమతఁ బూనఁగ లేక విచిత్రవైఖరిన్. 93

మ. సతిహృత్పుష్కరసీమఁ జన్గవ గిరీశప్రార్థనల్ సేసి త
ద్గతిఁ బ్రాపించిన నోర్వమిన్ విషధరాకారంబుఁ దాఁ బూనె నా
రతిపంచాననలీలఁ బొల్చె నడు మాహా యంచు ధమ్మిల్ల మా
శితికంఠత్వము నొంద నెమ్మొగము గాంచెన్ సోమభావం బొగిన్. 94

సీ. కాఁబోలు నిదియుఁ జొక్కపుసుధాకరరేఖ, కాదుపో నిష్కళంకతఁ
జెలంగెఁ, గాఁబోలు నిది యశోకపుఁదూపుదొరమాయ, కాదు
పో నశరీరగతిమఁ దనరెఁ, గాఁబోలు నిదియుఁ జక్కనివేల్పుపూఁబోఁ
డి, కాదుపో విభ్రమేక్షణము లొదవెఁ, గాఁబోలు నిదియుఁ దొల్క-
రిశీతనిపయ మెఱుంగు, గాదుపో నిశ్చల గతిఁ దనర్చె

తే. అనుచు రతిపతిమోహామృతాంబురాశి, మగ్నుఁడై
విస్మయాక్రాంతమానసాబ్జుఁడై సరోజేక్షణారూప
మరసి యరసి, నేర్పు మీఱంగ మఱియు వర్ణింపఁ దొడఁగె. 95

చ. కడువడి రాహు వేచ్చి నవకంజవిలోచనయాస్యచంద్రు నే
ర్పడర హరింపఁగాఁ దొడరి యమ్మదరాతికిరాసి యంచు నే
ర్పడ మదిలోఁ దలంచి మఱి గ్రమ్మరి వెన్నున నిల్చెనో యనఁగ
జడ యలరుఁ ఫణాగ్రరుచిచాడ్పున రేగడిబిల్లపైఁ దగన్. 96

తే. కళలకు ధామమై జలజగర్వ మడంచి సుధాప్తిఁ దారకా
కలనఁ జెలంగి తెల్విఁ గని కాముకపాలికి గుండెగాలమై
యలరెడుభామినీవదన మైందవబింబ మనంగఁ జెల్లదే
కలయఁగఁ గానిచో నచటఁ గల్వలపేరిటికన్ను లొప్పునే. 97

చ. కలువలు మీలుఁ దుమ్మెదలు గాంతకనుంగవ కోడి యందుఁ గా
వలసినకోర్కి దీని గెలువం దగువీఁడు మారుఁ డంచుఁ దూ
పులుగ ధ్వజంబుగా గుణముపొందికగా నయి వచ్చి దాని భ్రూ
చలనముతోన తద్ధనువు సంగతిఁ దప్పినఁ బోయె నన్నియున్. 98

క. వనితముఖాంబురుహస్థితిఁ, బనిగొని కాముకుల
గెలువ భావజుఁ డెలమిం, దనయుభయపార్శ్వ
ముల నుంచినచక్రములో యనంగఁ జెవు లలరారున్. 99

శా. భ్రూకోదండముఁ బూని దృష్టివిశిఖంబుల్ తోనె సంధించి బ
ల్లాకాచంద్రునిఁ బట్టి రెండుతునియ ల్గావించి తత్సారముం
బోకుండ న్నవరించి పార్శ్వముల నింపుల్ నింపఁగా నుంచె నా
నాకంజేక్షణచెక్కుటద్దములు చె న్నారుం దళు క్కుం చూగిన్. 100

చ. వరసుమనోవిలాసముల వైఖరి మాని తిలోత్తమాఖ్య యీ
ధర సుమనోవిలాసములఁ దద్దయుఁ గాంచెద నంచు వచ్చి యు
ద్ధురగతి నువ్వుమ్రాఁకుల నధోముఖి యై తప మాచరించి యీ
కరివరయానానాస యయి కాంచె సమస్తవిశేషవాసనల్. 101

సీ. క్షణవిలాసమె కాని సరి యౌనె చిగురాకు, సుమనోనురాగవిస్ఫూ
ర్తిఁ గనినఁ, బయిచాయమే కాని పగడంబు సాటియే, యామ్రలోక

గద్వీప మందు మనినఁ, దీప్పవన్నెల కాక దీ టౌనె బలుకెంపు, వర
సువర్ణావాప్తి వఱల కున్న, నెఱుపుమాత్రమె కాని యీడె బంధూ
కంబు, కమ్మతేనియతోడఁ గలసికొనిన

తే. సతతశోభాన్వితం బైనసార మగుచు, సరస మై రుచి
గన్పడి చక్క సగుచుఁ, జక్కెరల మించి ద్రాక్షపం
డుక్కడంచి, యమరునీవనితామణియధరమునకు. 102

క. కుందంబుల నవమౌక్తిక, బృందంబుల
దాడిమైకబీజంబులయా, నందంబుల జిగి
కెంపుల, చందంబుల నపహసించు సతిదంతంబుల్. 103

చ. అతులిత మైనశంఖము సమంచితగానము నేర్చు మంను నీ
యతివగళంబుఁ జెంది తనయందలివైభవ మెల్ల నిచ్చి త
ద్గతిని భజించి యంతఁ బలుకన్ రహిఁ బొల్పడ చయ్యెఁ గా జడ
స్థితులకు నబ్బునే స్థలవిశేషములం దప మెంత సేసినన్, 104

తే. మున్ను దము నేఁచుపగఁ బూని మోముఁబూపుఁ, జెందు
నిందునిఁ గరము లక్ష్మీసుకుసుమ, బిసలతలఁగట్టి యొగిరి
తన్ను నము మీఱు, జక్కవ లనంగఁ జెలిబిగిచన్ను లమరు. 105

తే. వనితగంభీరనరసలావణ్యవార్ధి, యుదసుధాపూర్ణ
కుచకుంభయుగము గాంచి, సకలలోకుల మిగుల
నిర్జరులఁ జేయు, నేకకలశంబు గాంచుకంధీశుఁ దెగడి. 106

మ. స్మరుఁ డన్విపుత్రుఁడు యావనం బనుతనూజాతోద్గతిన్ బాల్య మ
న్నురుడుం దీర్ప సుభావహోద్యరస మన్పుణ్యాహముం జేయుచో
వరున న్నిల్పినపూర్ణహేమకలశద్వంద్వంబు నాఁ బొల్చు నీ
సరసీజాస్యపయోధరద్వయము భాస్వత్పత్రరేఖాంక మై. 107

తే. ముగుదబాల్యపయోనిధి మునిఁగి డాఁగి, యావనం బ
నుహరిహయుసలదుకృపను, జెలఁగి వెలువడి వచ్చినశిఖరు
లనఁగఁ, గాంతయురమునఁ గుచములు గానఁబడియె. 108

తే. పడఁతిజఘనంపుపెద్దడాబాలు వూని, కాయజుండు పొక్కి
లనుసురంగమునఁ దూఱి, తెగువఁ గుచదుర్గయుగము
సాధించుకొఱకుఁ, దార్చునిశ్రేణి యన వళిత్రయము సెలఁగు. 109

చ. చెలిబలితంపుగబ్బిచలిసిబ్బెపుబిబ్బరపుబ్బుగుబ్బచ
న్నులఁ బెటిగొప్పభారమున నున్ననితిన్నెల మించుబల్పిటుం
దుల ననియాడుకొను పడునో యనుశంక సరోజసంభవుం
డెలమి రచించి కీల్కొలుపునిన్నుసలా కన నారు తీ రగున్. 110

చ. అరయఁగ నాభిపుష్కరమునందు విహారము కొంత సల్పి సుం
దరతరరోమావనం బనువనంబున బాహులతల్ చలింపఁగా
సరసపయోధరస్తబకసంగతిఁ గమ్మనితావి కెక్కి వి
స్తరగతి నేగుతుమ్మెదలచా లన నారు చెలంగు బోటికిన్. 111

చ. జడయనుతోఁక వెన్కడర సారపుఁగుంకుమచాఁతిరేఖ వే
ర్పడఁగఁ మిటారిగుబ్బ లనుభారపుఁగుంభము లంద మొప్పఁగాఁ
దొడరెడునారుసా రనెడుతుండము సాఁచి మనోజుదంతిరా
జుడుగక నీరు ద్రావుకొలనో యన నాభి చెలంగు నింతికిన్. 112

మ. చెలిసింగారపుఁబువ్వుఁదోఁట రసముల్ చెల్వొప్పఁగా నింపఁ బూ
విలుకాఁ డన్నలుకాఁపు గుబ్బ లను మేల్బిరంపుటెద్దుల్ ఘటిం
చి లలిం నీలపుటారు మోకెలమిఁ బుట్టి న్పట్టి మోటెత్తు మె
చ్చులచెంగల్వపుబావియో యనఁగ మించు న్నాభి గంభీరతన్. 113

క. చనుఁగవ బరువో మఱియుం, బెసఁకువ
గలశోభనాంగిపిఱుఁదులు బరువో, యని కన
విధి పిడికిటఁ బ, ట్టినసట్టో యనఁగఁ గౌను శేవ వెలయున్. 114

మ. జననాథాత్మజకాంచనోరుయుగళీస్తంభాగ్రభాగంబుపైఁ
బెను పై ముత్తరు లంతరాళులుగ నాభీద్వారమం దొప్పఁగా
స్తనజాంబూనదకుంభగుంభితతనూసౌధాంతరస్థాయి మా
రునిసింహాసనమో యనంగఁ జెలువారుం గాంచిదేశం బొగన్. 115

తే. మరుఁడు శృంగారవీథు లేర్పఱచి తనదు, పేర నొకపేట
గట్టి సంప్రీతిఁ బోర, జాల నుంచినకాలుకంబా లనంగఁ,
గలికియూరులు చెలఁగుఁ బైఁ గాంచి మెఱయ. 116

క. మకరములను లోఁ బెట్టుక, రకముగ వరశా
లులను ధరిం బడ పైచేర, నకిజంఘిక లని
యెంతయుఁ, బ్రకటించెం గాహాళులు రవంబుల దిశలన్.

తే. నెఱియ సారసములు దమ్ము నేలఁ బెట్టి, కాల రాచుచు
నున్నాఁడు కలువలచెలి, వెతలఁ బడఁ జాల మిది రాహు
వేణి యనుచు, నతివపదములఁ బడె నస నడుగు లమరు. 117

తే. నిరవలంబంబు తమయుండునిలయ మెల్ల, నందు నిలు
వాదరిక లే దటంచు వగచి, వచ్చి తారక లోకకొన్ని
వనితపదము, లందెనో యన వ్రేళ్లసఖాళి యమరు. 118

వ. అని మఱియు ని ట్లనియె. 119

సీ. చెలియపెన్నెఱిగుంపు చీఁకటి తలదన్నె, వదనఃసుకళ పట్టి చదిపె
విధునిఁ, జెలువకన్నులు లేళ్లఁ జెవులు వ ట్టాడించెఁ, గర మొప్పు గళ
ము శంఖంబు నూఁదెఁ, బాలతిచన్నులు చక్రములఁబొమ్ము వెనఁ
బ్రొక్కె, నారు సర్పముఁ గడు నంటి పొడిచెఁ, జెలికటి సైకతమ్ముల
వెక్కఁ బడ నొత్తె, నెత్తమ్మి నడుగులు నేలఁ బెట్టె.

తే. మిసిమిబంగారు పై నెక్కె మేనిచాయ, యే మనఁగ వచ్చు
నికాంతయింపుసొంపు, మించునవయవసౌష్ఠవం
బెంచి చూడ, వశమె వేనోళ్లు గలఫణీశ్వరున కైన. 120

తే. కురులఁ గుటిలత గావించెఁ గుచములందుఁ, గఠినత
విధించె సారసగర్భుఁ డెలమిఁ, జెలఁగి యీకాంతమున
సట్లు చేయఁడేని, యతనిఁ బుడమినిఁ జతురాస్యుఁ డనగ వచ్చు. 121

కామిని మూర్ఛ దేఱి కవింగవయఁ గోరుట.

వ. అని. 122

క. ఈరీతి బిల్హణుండు మ, హోరూఢి నిజాను
భావ మభినుతి సేయం, గా రామ తద్వచో
మృత, సారంబున మూర్ఛ దేఱి సంస్మృతియుతయై. 123

తే. యామినీపూర్ణతిలక యత్యంతపులక, దేహయై లేచి
మదిని సందేహ మెడలి, యబ్జుని హసించుకవివదనాబ్జ
మమరఁ, గాంచి యూహించె నిజవిలోకాంచితముగ. 124

ఈకమలేక్షణుసెద వసించినఁ గాని, యలనిశాచరుగర్వ మడఁపఁ జాల
నీసర్వమంగళాహితుని గూడినఁ గాని,యంగజాతవికార మార్పఁజాల

నీవిబుధేంద్రునిహితము సేసినఁ గాని, మెసఁగి మహత్తతి నేలఁ జాల
నీబ్రహ్మతేజుని నెనసి పల్కినఁ గాని, యిల ఖగాళి నధఃకరింపఁ జాల
తే. నితనిభాస్వత్కరాబ్జసంగతుల మెలఁగి, యేర్పడక గాని
మదితమిఁ దీర్పఁ జాల, నితనియధరామృతంబు నాయిచ్చ
దీరఁ, గ్రోలినం గాని తాపంబుఁ గూల్పఁజాల. 125

వ. అని మఱియుఁ దనలో ని ట్లనియె. 126

తే. చదువు సెప్పంగ గురుఁ డయ్యె సాహసమునఁ, జూడఁ జూ
డంగ మరుఁ డయ్యె సోయగమునఁ, దలఁపఁదలఁపంగ రా
జయ్యె లలితకళల, నిందు కేమి వచింతునే యిందువదన. 127

ఉ. ఏలఘుచిత్తనై కదిసి యీనవమోహనరూపుసన్నిధిన్
బాళిని జేరితే నితనిభావ మదెట్టిదొ కాన రాదుగా
లీలఁ బరిగ్రహించునొకొ లేక గ్రహింపక పోవునొక్కొ నేఁ
దాళఁగఁ జాల నింతి తనుఁ దానయి కోఱినఁ జుల్క నేఁ గదా.

వ. అని మఱియును. 129

ఉ. ఏగతిఁ బోవుదాన మఱి యీతని నేగతిఁ బల్కుదాన నా
లాగుమదిం దలంపక కళానిధి కాదని పల్కెనా పయిం
గాఁగలకార్య మెట్టిదొకొ కానిమ్ము డం దనగౌరవాప్తి యెం
తౌగడ మానొ యిందులకు నన్యవిచారము లేమి సేయుదున్.

వ. అని యివ్విధంబున వితర్కించి. 131

ఉ. రాజకుమారికామణి విరాళిని దాళఁగ లేక తూలి సం
యోజితకాండవస్త్ర ముపయోగము లేమికి మాని యప్పుడే
రాజితశయ్యపైఁ బడి సరాగముగా విలపించె నాత్మభూ
రాజశరాళికిన్ నిలుప రానితమిన్ భ్రమ ముప్పతిల్లఁగన్. 132

తే. హా కళాకాంత చతురాస్య హా కఠోర, మారనిశితశ
రాళి వేమాఱు నాటి, కలఁచ సంతాప మొదవైన
స్తరుణిఁ జూచి, ప్రేమఁ గొసవయ్య బాధ దప్పింపుమయ్య. 133

వ. అని సర్మగర్భంబుగాఁ బలికిన సప్పలుకులు కఠోరమారవీరదోరటచ్చా
పగుణటంకారనినదంబులుగా విని భావంబు గ్రహించి సంచలిత
హృదయుండయి కవిపుంగవుం డి ట్లనియె. 134

కామినీనర్మగర్భవాక్యములు విని కవి పలుకుట.

ఉ. తామరసాక్షి నీనిసితదారుణవీక్షణతీక్ష్ణబాణముల్
వేమఱు నాఁటి నాహృదయవీథి వ్రణం బొనరించెఁ జూడుమా
నీమెయి నౌషధద్వితయ మియ్యవె త్రావెదఁ బూఁత పూసెదన్
నీమధురాధరామృతము నీకుచకుంకుమపంక మేర్పడన్. 135

వ. అని మఱియు నిట్లనియె. 136

సీ. కరుణతో ననుఁ జూచి కాయజుశరహతిఁ, దప్పించు మిప్పుడు తర
ళనయన, చిఱునవ్వు వెలయించి చెలువైన వెన్నెలల్, మాయింపు మి
ప్పుడు మచ్చకంటి, పలుకులు వగ గుల్కఁ బల్కి పైకఘ్వనుల్, మా
న్పవే యిప్పుడు మధురవాణి, మోవిపానక మిచ్చి మోహదంభకతృష్ణ,
దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి

తే. కరము లలరించి బిగియారఁ గౌఁగిలించి, యొడలిచలిఁ
బాపవే భాస్వదురసిజాత, యతనుసామ్రాజ్య మేలించి
యాదరించి, వలపు లీడేర్పవే హేమలలితగాత్రి. 137

రాజకుమారి కవిశయ్యపైఁ జేరి క్రీడించుట.

మ. అనినం దామరసాక్షి కాండపట మత్యంతంబుఁ బోఁద్రోచి గ్ర
క్కునఁ దచ్ఛయ్యకుఁ జేరి ప్రౌఢగతి సంకోచింపకే లె మ్మహా
యని చేఁదమ్ములు చాఁపి చన్గవ యెదన్ హత్తించె గాఢంబుగా
ఘనమోహమ్మునఁ గౌఁగిలించెఁగవియుం గాతూహలం బొప్పఁగన్.

మ. కరముం జేర్పకమున్నె పోఁకముడి వీఁక న్వీడెఁ జన్దోయిఁ జె
న్నారయం బట్టకమున్నె జిల్గుఱవి కెంతో ప్రీలి వే పట్టునన్
విరిసె న్ముద్దుమొగంబుఁ జూచుటకు మున్నే స్వేచ్ఛ నాలోకసం
బరయన్ విస్మృతి మయ్యె నాసతికి వ్రీడావ్యాప్తి గోల్పోవఁగాన్.

చ. వలయవిశేషనాదముల వైభవసంగతభాస్వదంగకం
బులపులకాంకురప్రకరపూరములం బ్రవిబోధితాత్మభూ
సలలితతత్త్వమార్గములఁ జన్నుఁ లురస్థలి ముద్గునట్లుగాఁ
జెలువ సుఖింపఁ జేసెఁ గవిశేఖరుఁ బైకొని కౌఁగిలింపుచున్. 140

వ. అనిన దరహాసితవదన యయి కుందరదన యి ట్లనియె. 149

క. కవిరాజశిరోభూషణ, దివిషద్రాజాస్య లైన
దివ్యద్భవదీ, యవరాకృతిఁ గని యేఁకా,
రి పలుకు రే ననఁగ నెంత శ్రీతనయనిభా. 150

సీ. శృంగారమూర్తి వై చెలు వొందునినుఁ జూడ, వలెఁగాక కన్నులు
గలఫలంబు, చక్కనైనట్టినీచెక్కులు ముద్దాడ, వలెఁ గాక కెమ్మో
వి గలఫలంబు, మది కింపు సేయునీయొద రొమ్ము వెసఁ గ్రుమ్మ వలెఁ
గాక చన్నులు గలఫలంబు, నేర్పు మీఱినయట్టినీతోడ మాటాడ, వలెఁ
గాక నాలుక గలఫలంబు

తే. సేవ సేయంగ వలెఁగాక చెలువరాయ, యలరులను
గేరుచేదోయి గలఫలంబు, కలసి రతులను మెలఁగి పెన్గ
వలెఁ గాక, కవిశిఖామణి చెలి మేను గలఫలంబు. 151

శా. నీలావణ్యము నీకళాతిశయముల్ నీసౌకుమార్యోక్తియుల్
నీలాలిత్యము నీవిలాసగతులుల్ నీమంజువాగ్వైఖరుల్
నీలీలాతనుభాతి నీసరసముల్ నీయందముం జూడఁగా
నేలీలావతి యైనఁ బొందఁ గవిధాత్రీంద్రా యపేక్షింపదే. 152

వ. అని యిట్లు పలుక సంతోషితస్వాంతుం డై కవిభూకాంతుండు కాం
తాలలామకుచకాంతత్వం బపేక్షించి యి ట్లనియె. 153

సీ. పరభూమిభృత్తులభరము ద్రుంచినవేల్పు, మాంద్యంబు లడఁగించు
మహితకీర్తి, మైత్రిచే వెలసి ధర్మము గాంచుగుణశాలి, కర్పురచ్ఛా
యలు గలుగుమేటి, ఘనపుష్పమాలిక లెనసినవెఱజాణ, వాసనల్ ప్రా
పించుశుభవ్యాపి, వరయుక్తి నఖిలవైభవము లందినరాజు, చంద్రశే
ఖల నేలుసరసమూర్తి

తే. యగుచు నఖిలదిశావళి నాక్రమించి, ప్రేమ జనులను
బాలించుపేరు గాంచి, వారలకు బ్రాలై చెలంగును
దోయజాక్షి, యెలమి నీగబ్బిగుబ్బపాలిండ్లకోడు. 154

వ. అని పలికియు ని ట్లనియె. 155

సీ. మీనాకృతులఁ గాంచు మెఱయునీకన్నులు, కచ్ఛపరేఖ మీఱఁగాళ్లఁ
బెలఁగు, భూధరభావంబుఁ బొందు నీజఘనంబు, హరిలీలఁ దాల్చు
నూఁగారుతీరు, వామనాకృతిఁ బూను వల నొప్పు నీకౌను, భూమిభృ
ద్వైర క్షైత్రమొనయుఁ జన్ను, లమరు రామాభిఖ్యమై నీముఖాబ్జంబు,
నీలాంశుకస్ఫూర్తి నెగడుఁ గురులు

తే. రతులఁ దేలింపను బ్రబుద్ధురాల వవుదు, వరయఁ గలి
కివ యన్నిట నరసి చూడఁ, దనర నీయందునె దశావ
తారమహిమ, రుచిరలావణ్యసీమ తారుణ్యధామ. 156

సీ. ఘనులఁ బోషించు నీకచపాళి రాజస, న్మానంబుఁ గాంచు నీనగుమొ
గంబు, కువలయం బలరించుఁ గూర్మి నీకనుదోయి, శ్రీలఁ బెం పొం
దు నీచెలఁగు శ్రుతులు, ఇష్టఫలావాప్తి నెసఁగు నీకెమ్మోవి, కలల
మెప్పించు నీకలికిచన్ను, లహితాప్తి నడఁచు నీయలరారునూఁగారు,
సరసుల మెచ్చు నీసరసనాభి

తే. లసదనంతవిభూతి నీయసదుకౌను, చక్రములను
భరించు నీజఘనసీమ, యతులభద్రకరములు
నీయరిదితొడలు, పడఁతి పద్మంబు సేయు నీపదయుగంబు. 157

వ. అని వినుతింపుచున్నకవివరునిం గదిసి మాటిమాటికి మూటిగొన సా
టి వచ్చుజక్కవల నుక్కడంచి నిక్కి క్రిక్కిఱియుమిక్కుటంపుసొం
పు గలసిబ్బెంపునిబ్బరపుగబ్బిచనుగుబ్బల నురంబు తిరంబుగా నొ
త్తి తత్తరిలఁ గేల్దమ్ముల నిమ్ముగాఁ గ్రమ్ముకొని వెనుకకుఁ జనక మొ
నసి వనితామణి నెనసి మనసిజసంగరంబుతిరంబునకుఁ గరంబు మఱంగ
లించి బొఱంగి మెలంగుచు నితరేతరసమాకర్షణంబు లాచరించుచు
నన్యోన్యమధురాధరసుధాధారానుపానక్రియాంతరదశనక్షతవిజృంభణం
బుల సీత్కారంబులు నెఱపుచుఁ బరస్పరవిశేషవిషమశరసమరక్షమ
ముత్సాహంబుల నిట్టూర్పులు నిగుడించుచు స్మరవిశిఖశిఖరనఖంబులగు
నఖరముఖంబులనీటులు మెఱయఁ గాటులు పచరించుచు ముఖముఖా
వలోకననిరోధకచికురనికరంబులు కరంబులను గరంబు చిక్కఁ దక్కఁ
జక్క నవరించుచు స్థలాస్థలవిశేషంబు లవలంబించి బింబిరి గొనక హి

తంబు మెఱయఁ జుంబించుచుఘూత్కృతఫూత్కృతధూత్కృతహుం కృతసీత్కృత గృహాణగృహాణ ముంచముంచే త్యాదినినదంబుల కను గుణంబు లగుకాంచీసముచితఘంటికామంజుమంజీరవలయసలయని నదంబులు వినుచు నాగసింహకుక్కుటహంసాదిబంధవిశేషంబులం బరిభ్రమించుచు సలయుచు వలపులు వెలయఁ గలయుచు నిలుకడల నిలుచుచుఁ బొలంగిసఁ బొలంగకి మలసి పైకొని చేకొలఁదులఁ బట్టు దప్పక యిట్టట్టు తెట్టగిలక దిట్టలై గుట్టుమట్టు లేక వీఁకఁ దాఁకుచు నిట్టు షష్టిహాయనద్విరదంబులవిధంబున నందంబుగాఁ గందర్పనిదర్పం బడంచి మించి సౌఖ్యవారాశిఁ దేలుచున్నంత. 158

చ. పులకలజగ్గు నెమ్మినెఱపుఁ జిగినెమ్మొయినిగ్గుఁ జెయ్వులన్
వలగొనుసిగ్గు వింతయరవాలుపుఁజూపులకగ్గు నాదలన్
నెలకొనుతగ్గు మూర్ఛ దునుపునేర్పుల నెగ్గు ఘటిల్ల నొప్పన
చ్చెలి నలరించెఁ దా రతులఁ జెందుచు మాటికి మోహమందుచున్.

సీ. అసకృదాలింగనాభ్యాసనఖరిక్షతకుచం, బర్ధనిమీలనోద్యద్విమోగ
మానానుకూలక్రియారోధిమందాక్షు, మావిశ్రమాంబుకణావృతాస్య
మతిగాఢపరిపీడితాధరాధరబింబ, మనుదితమణితక్రమానుకలన
మస్ఫుటీకృతతథేత్యాలాపకౌశలం, బతిసాంద్రజనితరోమాంచవార

తే. మక్రమారబ్ధముగ్ధచేష్టాభిరామ, మతిశయానంద
పరవశాంగాంగ మవిది, తాన్యచింతన మాచకోరాక్షి
కపుడు, ప్రథమసురతంబు కవిలోకపతి యొనర్చె. 160

ఉ. వెచ్చనిపచ్చిగోరు లరవిప్పకనుంగవతీరు లారజం
బెచ్చినతక్కు లాత్మ కపు డింపు ఘటింపుసుచుక్కు లూర్పులన్
విచ్చినపూవికెంపు లెద నిండిననెయ్యఁపుసొంపులుం దగన్
రచ్చకు నెక్కెఁ జోరహితరాజముఖీసురతప్రసంగముల్. 161

తే. పరఁగ నీరితి రతిమనోభవులపగిది, యామినీపూర్ణ
తిలక బిల్హణుఁడు నతుల, రతులఁ గ్రీడలు సలుపుచు
రమణి మీఱ, ననుదినంబును నట్లుండె రంత వేడ్క. 162

క. తారాయనతటినీశ్వర, తారాయన
శిఖిశిఖాంకధాత్రీజహరిరా, ట్తారాచలనా
యకగీ, స్తారాచలరాజరాజసఖ సత్కీర్తీ. 163

భుజంగప్రయాతము. కథావిప్రధానా ప్రకాశాభిధానా
బుధారాధితార్థా, ప్రభూతాఖిలార్థా,
విధుస్ఫారకీర్తీ సువిద్యానువర్తీ
సుధామాధురీవ్యాగ్విశుద్ధానుభావా. 164

గద్య. ఇది శ్రీసీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచి
త్రకాశ్యపసగోత్రపవిత్ర శ్రీమత్పండిపెద్దికృష్ణస్వామిప్రణీ
తం బయినబిల్హణోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.



ఓం నమః కామేశ్వర్యై.

# బిల్హణీయము.

## తృ తీ యా శ్వా స ము.



శ్రీమహితరూపజితశత, కామా కామాంధకారగర్వోద్ధతను
త్రామారిమదనిషూదన, క్షేమాకరదివ్యనామ సీతారామా. 1

తే. అవధరింపుము తదనంతరావధాన, మహిమ బిల్హణ
కవితోడ మంజువాణి, యామినీపూర్ణతిలక విహార
గరిమఁ, దనరుచున్నంతఁ జెలులు తత్కార్య మెఱిఁగి. 2

చెలులు కవితో రాజకుమారి కలయుట రాజున కెఱిఁగించుట.

వ. ఇట్లు తమలోన. 3

క. ఓకమలనేత్ర వింటే, యీకవిసన్నిధిని సరసి
జేక్షణ యెంతో, చేకొని విద్య గ్రహించుటె,
కాక మఱియు నిపుడు కానికార్య మొనర్చెన్. 4

తే. ఇందు కే మందుమమ్మ యోయిందువదన, విభున కెఱిఁగింప
వలెఁ గవివిభునినతడ, మనకు దాఁచంగ నేటి కేమనఁగ
వలసి, మీఁద నెటు వోయి యెటు వచ్చునో తలంప. 5

వ. అని తర్జనీకలితనాసాగ్రలై నుదుక్కు మనుచు రాజసాన్నిధ్యంబున
కేతెంచి మ్రొక్కి యున్నంతఁ బ్రసన్నవదనుం డయినయన్నరపాలుం
గనుంగొని గద్గదకంఠులై విన్నపం బాకర్ణింపుఁ డని వారిలో నొక
బోటి యి ట్లనియె. 6

తే. రాజరాజేంద్ర మదనాభిరామనృపతి, దేవరకుమారి
యాకవిధీయువలన, విద్య యభ్యాస మొనరించువేళ బద్ధ
కాలికోపట మంకుశము గాఁగఁ గపట మొదవె. 7

చ. ఎఱుఁగఁగ రాదు దైవకృత మెట్టిదియో మనమంజువాణియే
గుఱిగొని యద్ధరామరుని గూడిసియట్టుల మాకుఁ దోఁపఁగా
గురు తెఱఁగీవిధంబు మది గోప్యముఁ జేసిన హాని వచ్చు నం
చరిమురిఁ జెప్ప వచ్చితి జనాధిప యే మిఁక బుద్ధి మీఁదటన్. 8

వ. అనిన విని యత్యంతకంపితస్వాంతుం డై భూకాంతుండు నిట్టూర్పు
నెసంగఁ దనలో ని ట్లనియె. 9

క. ఏ నొనరించుట యెట్టిది, యేనవిధం బెమి యాఱ
డాయెను భువిలోఁ, దా నొకటి దలఁప దైవము,
మానుగఁ దలఁచు నొకటి యనుమాట నిజం బై. 10

వ. అని వితర్కించి వారలం బనిచి పుత్త్రికామణిసమీపంబునకు వచ్చి
నిలిచి యి ట్లనియె. 11

రాజు తనకూఁతుసమీపంబునకు వచ్చి నీతులు పలుకుట.

శా. పట్టీ రాజకుమారశేఖరులఁ బిల్వం బంచి భూపాలకుల్
చుట్టా లందఱు మెచ్చఁగా నగరముళ్ శోభిల్లఁగాఁ జేసి మే
లుట్టిరి యిట్టముగా స్వయంవరమునన్ భూషించి నిన్ బ్రేమ నే
నెట్టో నేయుఁ దలంచి తిం పొదవఁగా నిచ్ఛానుకూలంబుగన్. 12

ఉ. కోరినరాకుమారకునకుం బ్రియ మందఁగ నిన్ను నిచ్చి యెం
తో రహిం మీఱి సౌఖ్యమున నుండెద నంచుఁ దలంచి యున్న నా
కోరుకు లెల్లఁ బో నణఁచి కొంతుఁ గలంకము లేనివత్కులం
బారఁగ దుర్యశంబు మహిం నందఁగఁ జేసితివమ్మ బాలికా. 13

వ. అని పలుకుచున్న జనకునిఁ జూచి పుత్త్రికామణి యి ట్లనియె. 14

రాజపుత్త్రి రాజుతోఁ దాను దోషరహితురాల నని చెప్పుట.

శా. అయ్యా యెన్నఁడు లేనివార్తలివి యే మత్యంతముం బల్కెదీ
నయ్యో నీ వొనరించుకృత్యమిసుమీ నీయాత్మవ్యథం జేయు నా
యాత్మయానవ్యబ్జముఁ జూచితే మదికి సందేహంబుగాఁ దోఁచునో
తే నీయాజ్ఞం దెలి యంకుశంబు గదె నిర్నిద్రానుకంపానిధీ. 15

క. ఏమయ్య యేమి వింటివి, యేమహిమ యెటులఁ
దోఁచుచున్నది నీకున్, మామకచిత్తము
దెలియదె, నామది సంశయము లేమి నన్యవిచారా. 16

క. నీయాజ్ఞ లేనికార్యము, మాయయ్యా సేయ నోప
మాయిరువురకున్, ఈయెడ హృత్సంయోగం,
బేయుక్తి ఘటించుఁ దెర హరింపఁ దరంబే. 17

క. అది గాక నాకు వ్రతము, న్నది యెఱుఁగవె
యంధకుని మనంబున నైనం, బదఁపడి దర్శిం
పను నీ, మది నన్యవిచార మేల మానవపాలా. 18

వ. అనినఁ గరుణాయత్తచిత్తుం డై రాజోత్తముం డిట్లనియె. 19

చ. తొడరఁగఁ బూర్వ మేమయిన దో యది పోవఁగనిమ్ము పుత్త్రి నీ
గడవఁగ లేను వంశము వికారము సేయక యింక నైన నీ
నడతలు మాని యుండు సుమనస్స్థితి సత్కులసూతి కెంత యి
య్యెడ నొకరాకుమారునకు నిచ్చెద నిన్నుఁ గృపామతిం దగన్. 20

వ. అనిన విని మనంబొప్పక శంకారహితచిత్త యై మత్తగజయాన
యి ట్లనియె. 21

కాంత తనమనంబు కవియందాసక్తమై యున్న దనుట.

మ. ధరణీపాల వచించెదన్ వినుము చిత్తం బక్షులున్ ఘ్రాణమున్
వరజిహ్వాశ్రుతు లంచితం బయినసంస్పర్శంబు నాధీనం
మ రతిన్ నిల్చెను బుద్ధిపూర్వకము గాఁ దోడ్తోడ నిం కేరికిం
గరమై యిచ్చెదు చేతనారహిత మీ కాయంబు నాయంబు గాన్.

వ. అనిన విని కోపారుణితాయతాక్షుం డై నరాధ్యక్షుండు శీఘ్రంబుగా
సభాస్థలంబునకు వచ్చి కుపితసింహంబుకరణి సింహాసనాసీనుం డై
సభాసదులం గలయం గనుంగొని యిట్లనియె. 23

రాజు కుపితుండై సభాసదులతో నాలోచించుట.

తే. అపర సంతతిపుర ద్రోహ మాచరించు, వాని నేశిక్ష
సేయంగవలయు మీరు, ధర్మపద్ధతిఁ బలుకుఁడు
తగినశిక్ష, సేయుదము వాని సద్గుణశ్రేష్ఠులార. 24

వ. అనిన విని సభాసదులు గలంగి మనంబుల ఘనస్థంబులుగాఁ దోఁచి
యాలోచించి యిట్లనిరి. 25

క. కార్యాకార్యము లెఱుఁగక, మర్యాదలు
నడపువాని మహిపతి యెంతే, నార్యానుమతిని
హింపవ, ద్ధర్యా దండింపవలయు దండధరుండై. 26

వ. అందు నొకకొంద ఱి ట్లనిరి. 27

క. ధరణీశ విచారించిన, ధరణీతలమందు నన్ని తప్పులె చూడం,
గరుణించి కావవలయును, బరికింపఁగ నెట్టు లైన భవ్యవిచారా. 28

వ. అనిన మఱికొంద ఱి ట్లనిరి. 29

ఆ. లేఁత ముదు రెఱింగి నీతిఁ దండింపఁగా, వలయుఁ గొన్ని
మాన వచ్చుఁ గొన్ని, మానఁ దగవు గొన్ని మహిమీఁద
ధరణీశ, యెంతకార్య మైన నిదియ హితము. 30

వ. అనినఁ గొందఱు రాజభావం బెఱింగి యి ట్లనిరి. 31

క. ఏకార్య మైన మానవ, లోకోత్తర యమునిరీతి లోకంబున నా,
లోకించి దుర్జనావళిఁ, గైకొని దండింప కున్నఁ గలుషము వచ్చున్..

వ. కాన శిక్షాకరణంబు కర్తవ్యం బన రాజు దుర్గపాలకులం బిలిపించిన. 33

సీ. గండ్రగొడ్డళ్లు గొంగళ్లును జికిలిచ, ల్లాడముల్ మైలచల్లాడములును
గఱుతుచుంగులతలగుడ్డలుఁ గావిబొ, ట్లినుపకడేలుఁ దాళ్లినుపముడ్లు
నీలికాసెలు మెడ నీలికుచ్చుల త్రాళ్లు, బరు వైన వడిసెలల్ బిల్లమెట్లు
కాఱుమేనులు బలుకోరమీసములును,బిగివంపుచూపులు జెట్టు గడ్లు

తే. నొడలఁ గోరోచనపుఁబూఁత లుట్టిపడఁగ, వచ్చి
తలవపు లెల్లను మెచ్చు దొరయ, నిలిచి చేతులు మొగిడించి
నేర్పుతోడ, దండ మిడి యూర యై యున్న ధరణివిభుఁడు. 34

వ. అందు వీరసేనుం డనునొకతలారినిం జూచి యి ట్లనియె. 35

రాజు బిల్హణునకు శిరశ్ఛేదం బాజ్ఞాపించుట.

శా. ఓరీ బిల్హణనామధేయకవి నుద్యోగించి రాఁ దీసి దు
ర్వారస్ఫూర్జితదీర్ఘపాశములచే బంధించి కొంపోయి వే
దూరం బైనశ్మశానవాటి ముఖ మాలోకింపకే నిర్దయా
ధారస్వాంతుఁడ వై తదీయశిర ముద్దామంబ్రాప్తి ఖండింపుమా. 36

వ. అని ముష్కాత్ముఁ బలికిన [illegible] వీరసేనుం డి ట్లనినా.

క. కోపముచే శిక్షింపను, భూప యనుగ్రహముచేతఁ బ్రోవఁగ దక్షుం
డేపట్ల నృపతి వసుమతి, నీపద్ధతి నరసి చూడ నితరము గలదే. 38

క. దేవర యేమి వచించిన, నావిధమునఁ జేతు
నేను నది యెట్టిదో మీ, భావము యోగ్యా
యోగ్యవి, భావముగాఁ గానవలయుఁ బరహితబుద్ధిన్. 39

వ. అని పల్కిన రాజు కోపించి యావలి మొగం బయిన వీరసేనుండు.

క. భూపాలుఁడు సెప్పిన వినఁ, డాపాపము
పుణ్యమంత యవ్విభుని దె తా, రూపించినట్లు
సేయుదు, నీపట్టున దైవయోగ మె ట్లున్నదియో. 41

వ. అని తద్గృహంబుఁ జొచ్చి. 42

తే. పుస్తకము చేతఁ బూని తత్పూర్వకార్య, మెఱఁగి తనలోన సతి
భజియించువాని, నోడిఁగి శయ్యాతలంబున నున్న
వాని, బిల్హణునిఁ జేరి తలవరి బెగడ ననియె. 43

క. ఓకవిరాజశిఖామణి, నీ కొకవిన్నపము
సేతు నృపవరుఁ డిపుడే, చేకట్లు కట్టుకొని
చని, యాకడ దండింపు మనుచు నాజ్ఞ నొసంగెన్. 44

తే. దేవ నీపట్ల యిది యేమొ తెలియ రాదు, చెప్ప నెంతయు వినఁ
డాయె శీఘ్రగతిని, ల మ్మనుచు డాసి వాఁడు చేదమ్మి
పట్టి, తిగిచి యుపపాశములను బంధించె నంత. 45

తే. కవివరుఁడు లేచి ఒక్కలు కలయఁ జూచి, మంత్ర
దేవతఁ గా నారమణి నిజాత్మ, నిలిపి తలవరి వెంబడి
నిశ్చలమతిఁ, జనియె సచ్చటిజనములు సందడింప. 46

వ. అప్పు డొక్కసఖి త్వరితగతిం జని రాజపుత్త్రితో ని ట్లనియె.

రాజపుత్త్రి కవియవస్థను సఖివలన నెఱింగి
తండ్రిం జేరి యడిగికొనుట.

శా. అక్కా బిల్హణు దుర్గపాలకులు ప్రాజ్యస్ఫూర్తి దుర్వారులై
చిక్కం బట్టి మహోగ్రపాశముల నాక్షేపించుచుం బాహువుల్

ప్రక్కల్ తెక్కలు మొక్కలంబుగ వెసన్ బంధించుకే ముట్టి యీ
చక్కం బోవుచున్నవా రిదె సఖి శక్యంబె వీక్షింపఁగన్. 48

వ. అనుపలుకులు చెవులకు ములుకులు సొనిపినట్టివి యయిన హాహాకా
రంబు నొంది యిందులకు నేమి కార్యం బని విచారించి దిగ్గున లేచి.

చ. నడు మసియాడ నెమ్మొగమునం జెమటల్ జనియింపఁ బాదముల్
తడఁబడఁ బైఁట జాఱఁ గనుఁదమ్ముల నీరు దొలంక వేణియున్
విడివడి తూలియాడ నవనిం బడి లేచుచు నెల్గుతోడ న
ప్పడఁతుక సేర వచ్చెను సభాస్థలి రాజసమీపభూమికిన్. 50

చ. కుటిలత రాహు వేర్చి తనకోఱలఁ బాదుగ నొక్క మిక్కిలిన్
జొటచొటగా సుధారసము జొబ్బిలుచున్న శశాంకురీతి న
చ్చటులవినీలకుంతల విశాలవిలోచనపాళి నీర ము
త్కటముగ దూఁకఁగా వదనకంజము విన్నఁదనంబు దోఁపఁగన్. 51

క. నాతండ్రీ యీవిధమునఁ, జేతురె గతజలమునకును
సేతు వ దేలా, చేతఃకునఁ దలఁపు మాకవి,
చేతోవిభుఁ డన్యు నొకనిఁ జేపట్టెదనే. 52

క. అది గాక బ్రాహ్మణోత్తముఁ, డొదవును దోషంబు
నీకు నుర్వీశుఁడ వే, మిది రాజధర్మ మగునే,
పదఁపడి ప్రోచుటయ మేలు ప్రజలు నుతింపన్. 53

ఆ. భవ్యుఁ డితనివలనఁ బాప మింతయు లేదు, కామపీడితాత్మఁ
గాన నేను, గదిసి దోష మతనిఁ గట్టికొంటెని నన్ను,
నాజ్ఞ సేయవలయు నతని వలదు. 54

క. అటు గాక పోయినప్పటి, కిట నుంపక మమ్ము నొక్క
యెడ నుంపవె యు, త్కటదృష్టి మాని తండ్రీ,
యిటువలెఁ జేయంగఁ దగ దహీనవిచారా. 55

క. ఇదియును గూడకపోయిన, నొదవఁగ మఱి యొక్క
యూర నుంచుము దగ ము, మ్మది గా దరిశే మఱి
యొక, పదమున కీదేశ మెడలఁ బంపుము తండ్రీ. 56

తే. నిగ్రహానుగ్రహములకు నృపుండు దక్షుం, డరయ నంచు నకార్య
కార్యములు లేవె, మెన్ని యుండిన బ్రాహ్మణు నేచ రాదు,
"బ్రాహ్మణాః భర" యనియెడుపలుకు వినవె. 57

వ. అని దీనాలాపంబుల సద్బ్రాలామణి విలపించుచు మఱియు మఱియుం
బలికిన నైశ్వాసనియమము ఘృతంబుం జిలికిన చందంబున మండిపడి
ప్రత్యుత్తరం బియ్యక విముఖుం డయిన గంబుకంఠి రాజువలనం దిర
స్కృత యై యాస్థానంబు వెడలి పోవుచు ని ట్లనియె. 58

సీ. తండ్రి నాపయి నింత గయ సింపం డాయెంగా, డాయెంగాం బో
యి నే దండ మిడినం, దల్లి యడ్డప డిది దప్పింప దాయెంగా, దా
యెంగాం దలచెనో తనయ యనక, ఆళీజనశ్రేణి కాత్మ నిం పాయెం
గా, పాయెంగా రానియీపాటు విన్నం, గలవారి కెల్లం గన్నులు
చల్లనాయెంగా, నాయగాథంపుంజందంబుం గన్నం

తే. గటకటా యెవ్వ రైన నాకష్ట ముడిపి, ప్రోవలే రైరి లే రైరి
భూతదయులు, నేమి సేయుదు నే మందు నెందుం జొత్తు,
ననుచు వగచుచుం గవిమార్గ మనుసరించి. 59

కాంతామణి కవినిం గూర్చి విలపించుట.

ఉ. హా! కవిరాజరాజమణి హా! నవమోహన హా! మనోహరా
హా! కరుణాగుణాభ్యుదయ హా! రమణీనవపంచసాయకా
హా! కమనీయగాత్ర యొక రైన నినుం గృపం బ్రోవరై రయో
యీకడ నీవు దైవమున కేమి విరోధము సేసితో కదా. 60

సీ. వికటదుస్సహమహావిషము కంఠంబున, దాక్షాయణీశుండు దాల్ప
లేదె, సతతదుర్వారవిస్తృతశిఖాబడబాగ్ని, జలధి యంతరమున
నిలుప లేదె, సకలచరాచరజంతుజాలము నెల్ల, నేర్పడం బుడమి
వహింప లేదె, పృథివీతలం బెల్లం బృష్ఠభాగమునందు, నిలం గూర్మ
పతి భరియింప లేదె

తే. యంతకన్నను గవివరునందుం గలదె, దోషభర మెవ్వ రైనను
దాడరి ప్రోవ, రయ్య భూపతి వినం జెప్పరయ్య కరుణ,
నింపరయ్య నా వెత నివారింపరయ్య. 61

సీ. మోహించి గౌతమమునిసతిఁ బొందిన, పురుహూతు నమరులు ప్రో
వలేదె, గురుపత్నీగమనంబుఁ గోరి చేసినచంద్రుదు, నీశుండు మౌళి
వహింప లేదె, కడిమిమైఁ గూఁతును గని పొందఁ గోరిన, పరమేష్ఠి
శౌరి చేపట్ట లేదె, స్మరవశుం డై సీతచనుఁబోయి గీఱిన, కాకిని
రఘుపతి గావ లేదె

తే. యంతయును ద్రోహ మీతనియందుఁ గలఁడె, నేను గోరిన
విప్రుండు గాని యితర, వంశజుఁడు గాఁడు ధర్మంబువరుసఁ
జూడఁ, బుణ్యు లెవరైన నీకవిఁ బ్రోవరయ్య. 62

వ. అని మఱియు ని ట్లనియె. 63

ఉ. ఆకవిరాజుఁ బ్రోవ తన కయ్యెడఁ గాక యటంచు సుందరీ
లోకశిరోవిభూషణము లోలత దిక్కులు సూచి తెంపునై
రాకలు పోకలుం గలుగురాజుల నాస్యలఁ గాంచి యెంతయున్
శోకముతో విలజ్జ యయి సోలుచు వ్రాలుచుఁ బల్కె నిట్టులన్. 64

సీ. ఎక్కుడుగా మది నెంచి పండితహంస, నాదరింపరే చతురాస్యులార
కారుణ్యమున గతి గల్పించి ద్విజరాజు, భరియింపరే చక్రభరణులార
నిరుపమసత్కళానిధిని మన్నింపరే, తలయొడ్డి రాజవతంసులార
విదితనిరాధారు విబుధేంద్రు నిలుపరే, యిరవొంద భూరిధరేంద్రులార

తే. సుకవితాపంబు దీర్పరే శూరులార, బ్రహ్మకులజునిఁ దేరె
గోపాలురార, ధర్మగతిఁ బూని రాజకందర్పులార,
నామనోహరుఁ గూర్పరే నాయ మెఱఁగి. 65

సీ. చాతకంబుల దయచేతఁ గంబు లొసంగి, ప్రోచునాఘనురీతిఁ
బ్రోవరయ్య, కోరికల్ దీరఁ జకోరికల్ మీఱఁగాఁ, బ్రోచునాశశి
యట్ల ప్రోవరయ్య, రసజాత మెసఁగ సారసజాతములఁ దగఁ, బ్రోచు
నారవిభాతిఁ బ్రోవరయ్య, సుమనోవిభుల నెల్ల, సు మనోవిశాలుఁ
డై, ప్రోచునాహరిమాడ్కిఁ బ్రోవరయ్య

తే. తల్లి ప్రజలను గలయంగఁ దల్లి ప్రజలఁ, బ్రోచువిధముగ
మమ్మును బ్రోవరయ్య, పాపరహితాత్ములవు వెతఁ
బాపరయ్య, ధన్యులార కృపాళుమూర్ధన్యులార. 66

సీ. ఘనులార దురితలంఘనులార గావరే, యామహేశుని బోలునీమ
హేశుఁ, బతులార మతిబృహస్పతులార గావరే, యాబుధేంద్రుని
బోలునీబుధేంద్రు, ధనులార సుగుణవర్ధనులార గావరే, యాకళాఢ్యు
నిఁ బోలునీకలాఢ్యుఁ, గృతులార కలితోపకృతులార గావరే, యాద్వి
జాంకునిఁ బోలునీద్విజాంకు

తే. జ్ఞానభోగదయాసారగరిమఁ గాంచుఁ, గాంచి యీకవి మన్నించి
కావరయ్య, పెంపు గనరయ్య నామొ రాలింపరయ్య,
యొంచఁ గదరయ్య ధర్మమార్జించరయ్య. 67

క. తమ్ములకుఁగీడు సేయున, ఘుమ్ములు గలరాజులెల్లఁ గాతురె పరులన్,
నమ్మఁ దగరు దోషాకరు, లిమ్మహిఁ దలపోయ నింక నేమన నేర్తున్.

సీ. సుమనోవిభూతివిస్ఫూర్తి గన్వారికిఁ, జెలఁగి యీబుధుని రక్షించు
టెంత, కృతధర్మ లైన సత్త్వగతిఁ గాంచువారికి, నీధర్మమతి భరియిం
చు టెంత, భువనాధినాథు లైపాలు పొందువారికి, నీద్విజాధీశు వహిం
చు టెంత, యబ్జారిధరునిసఖ్యము సేయువారికి, నితనిఁ గృతార్థుఁగా
నెన్ను టెంత

తే. కాన నీకవి శుద్ధాత్ము లైనవారు, పుణ్యజను
లైనవారును భూరిసత్త్వు, లైనవారును సర్వజ్ఞు
లైనవారుఁ, బాలుపడి ప్రోవఁ దగు లోకపాలురార. 69

సీ. మాకంద కానవే మా కందముగ రతి, చ్ఛాయ లిచ్చితివి సుచ్ఛాయ
లొసఁగి, పురుష కానవె మహాపురుషసంగతియుఁ గా, వించితి వపు
డు భావించి చూడఁ, బనస కానవె తల్లపనసరోజము చూడ, నొనరిం
చితివి మాకు నొనరఁ జూపి, క్రముక కానవె శుభక్రముకరార్పితకుచ,
పాళిఁ జేసితివి నీపాళి నన్ను

తే. నాఁటిప్రేమ మనంబున నాటి యంతఁ, జూపవలె నేఁడు
నాకవిఁ జూప నరయ, ఘనతరులు మీరు గాన నే ఘనత
నేతు, ఘనతరుఁ డతండు మీకు లంఘనత దగునె. 70

సీ. మానసోల్లాసి యై మన్నించునాకవి, హంస గానరె రాజహంసలార,
సహకారశాలి యై సంగతుల్ గాంచుమ, త్ప్రియుని గానరె వనప్రి
యములార, యతులసదారసస్థితిఁ జెలంగెడుశుభ, వ్రతుని గానరె

చక్కెరబొమ్మ యట్టిదె విచారము లేటికిఁ జూచునంతలోఁ
జక్కెరవింటిజోదు రభసమ్మునఁ దూపులు వింటఁ గూర్చి బల్
చిక్కులఁ బెట్టుకుండునె వచింపఁగ నొంటిగ నుండువేళలన్. 79

చ. కటకట యెట్టు భూసురుని గాసి యొనర్పఁ డటంచుఁ బంచెన
క్కుటిలుఁడు భూమిపాలుఁ డిది కూడదు చెప్పఁగ నేర కైన నిం
తటికిని దైవయోగము కదా తలపోయఁగ వానిభాగ్య మి
ప్పటి కిటు లుండె నిట్టిపని ప్రాజ్ఞుని కెచ్చట నైనఁ బాడియే. 80

చ. ఇల నిఁక నీనిఁ బట్టి వధియించిన నీసతి మేనఁ బ్రాణముల్
నిలుపదు దానికిన్ జనని నిల్వదు భూవరుఁ డంతట న్మదిం
దలఁపగ నేమి యౌనో యట ధారుణి యేవిధ మౌనో యింతకుం
జలమఱి భూవిభుండు కవి సన్మతిఁ బ్రోచిన నన్ని చక్కనౌ. 81

వ. అని యిట్లు వేఱువేఱ గుంపులుగట్టి పలుకుచున్న నొకకొందఱిట్లనిరి

క. చోరుఁ డనునామ మీకవి, కారయఁగను
నేఁటికిని యథార్థం బయ్యెన్, జారుఁడు మఱి
రెండును దగె, శూరులు మెచ్చుదురె జారచోరత్వంబుల్. 83

వ. అనుటయు నకాంతాలలామం బక్కవివరునిం జూచి యిట్లనియె. 84

ఉ. హా! కవిరాజచంద్ర మదనాంచితవిగ్రహ నన్ను నిప్పుడ
స్తోకవియోగవారినిధిఁ ద్రోచి చనం దగ వౌనె నీకు న
య్యో! కరుణాంబురాశి వని యుల్లమునం దగ నమ్మియుంటి నీ
వేకత మెట్టు లేగెదు రహిం గన గూడిక మేలు నెల్లదే. 85

వ. అని విలపించుచున్న నామార్గంబునం బోవుచుండి విని బిల్హణుండు
దోధూయమానమానసుండై తిరిగి చూచి యిట్లనియె. 86

బిల్హణుండు కామినింగూర్చి పలుకుట.

ఉ. హా! కమలాయతాక్షి చెలి హా! సరసీరుహకుట్మలస్తని
హా! కమనీయగాత్రి సతి హా! నవమోహిని హా! వధూమణి
హా! కనకాంగి నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు నీ
శోకమునందు జీవనకు బోలదె గాక స్వతంత్ర మున్నదే. 87

ఉ. ఓరమణీమణీ వికసితోత్పలపత్రవిశాలనేత్ర నీ
వారక యేల చూచెదవు ద్వారనివాసిని గోల దేవతా
వారవధూటికానయనవాగురికావలయంబునందు దు
ర్వారతఁ జిక్కి తా మగిడి వచ్చునె బిల్హణుఁ డెన్నిభంగులన్. 88

వ. అని పలుకుభూసురవరునిఁ దలవరు లుఱుగతిఁ బద మని శ్మశానవాటికిఁ దోడుకొని పోయి యొకవటవృక్షంబుక్రింద నిల్పిన బిల్హణుఁడు సలుఁ దెసలం జూచి తల్లడిల్లనియుల్లంబుతో మందస్మితవదనారవిందుం డై వీరసేనున కిట్లనియె. 89

క. ఓతలవరి తడ వేటికి, నాతతనిశితాసిఁ గొని ధరాధీశునియా
జ్ఞాతంత్రమునను బిల్హణు, వేతెగ వ్రేయుము శిరంబు విశ్వము మెచ్చన్. 90

వ. అనిన విని వీరసేనుం డిట్లనియె. 91

క. కవిరాజవర్య నీ విపు, డవిరళగతి నించు కైన నాత్మ భయంబుం
దవులక దరస్మితాస్యుఁడ, వవుటకుఁ గత మెద్ది సెప్పు మమలవిచారా. 92

వ. అనిన బిల్హణుం డిట్లనియె. 93

చ. హితమతిఁ జెప్పెద న్వినుమహీనగుణాకర వీరసేన యా
క్షితిరమణాత్మజాత సరసీరుహలోచన మంత్రదేవతా
కృతి యయి వేడ్క నాహృదయగేహమునందు వసించి జోడుగా
సతతముఁ గాయ కుండఁగ విచారము లేటికి దైన్య మేటికిన్. 94

వ. అని మఱియు నిట్లనియె. 95

చ. కలికి వధూమణిన్ స్మరవికస్వరచారురుచిన్ గుణాకరన్
జలరుహలోచనన్ జలదచంచలవేణి సుధాకరాననన్
సలలితతుంగపీనకఠినస్తనమధ్యగహారభాసురం
దిలసుమనాసికన్ మదిని దేవతఁగా స్మరియింతు నెంతయున్. 96

తలవరి కవిని ఖండింపక యుంచుట.

వ. అని తదేకాయత్తచిత్తుం డై నకవివరుసిం జూచి ఖండింపఁ జేతులు రాక హృతబహుజనహారిణిం బగుకృపాణంబు నేలం బడవైచి వీరసేనుండు కృపాధీనుం డై నిలువఁబడియున్న తదనంతరంబ యవ్విప్రుండు రాజపుత్త్రిని దనహృదయంబున నుపలక్షించి యిట్లనియె. 97

కవి కామినిని హృదయంబునఁ బలుతెఱంగుల స్మరించుట.

చ. పరమసువర్ణచంపకవిభాసురగౌరి సురోమరాజి ని
ద్దరఁ గొని మేలుకొన్నసతిఁ దోయరుహాంబకవిహ్వలాంగిఁ దా
మరసదళాయతేక్షణఁ బ్రమాదవశంబునఁ బోవువిద్యవై
ఖరి మదిలోనఁ నెప్పటికిఁ గాంక్ష దలిర్పఁగఁ జింతఁ జేసెదన్. 98

మ. విలసత్పంకజమధ్యగౌరరుచి యై పెంపొంది గోరోచనా
తిలకోదంచితపాటలద్యుతికసద్విభ్లలాటంబు నై
లలి నొక్కింతమదంబుచే నలసలీలాఘూర్ణదృక్పాత మై
చెలువొందున్ సతిమోమునన్ నిలుచు నా చిత్తంబు యుక్తంబుగాన్.

చ. శ్రమజలసాంద్రబిందుతతి సారపుమౌక్తికరాజి వైఖరిం
గొమరు నెలంగ హేమమణికుండలదీప్తుల గండభాగముల్
రమణ రహింపఁగా నుపరిరత్యనుభూతినియోగ మంది చె
ల్వమరుతదాస్య మెప్పటికి నాత్మ భజించెద నిశ్చలుండ నై. 100

ఉ. పున్నమనాఁటిచందురునిఁ బోలుమొగంబును మొల్కచన్నులున్
సన్నపుటారు లేవయసు చాయలఁ దేఱినమేనిసొంపు నా
కిన్నియహాపు నే మగుడఁ గాంచితినేని మనోజసాయకా
గ్ని న్నెఱకాఁక దోకొనిననెమ్మొయి నెమ్మదిఁ జల్లఁ జేయుదున్. 101

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి నే నొకరాతిరి తుమ్మినన్ "చిరం
జీవ" యటంచుఁ దచ్ఛుభవిశేషవచోవిభవంబు మాని రో
షావహచిత్త యై పలుక కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం
దావిధి నామది న్మదలి యాడుచునున్నదిగా ఘనంబుగాన్. 102

ఉ. ఉన్నతచారుపీవరపయోధరభారముచేత ఖిన్న యై
చెన్నగునూత్నయౌవనముచేఁ దనరారుసుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వదనంబు ముదంబున ముద్దువెట్టుచున్
వన్నియ మీఱు మత్తమధుపంబు సరోరుహ మానుకైవడిన్. 103

ఉ. మానిని విస్ఫురత్కమలమంజులపత్రవిశాలలోచనం
బీనకఠోరతుంగకుచ భృంగగరుద్రుచినీలవక్రస
న్మానితకోమలాలక సమానవరాకృతిఁ గామదేవతన్
దాని గుహాపదేశమువిశంబున ధ్యానము సేతు నాత్మలోన్. 104

మ. సరిపాల్ చూపులు మొల్లక్రొవ్విరులకాంతిం జెందుపల్గాడ సుం
దర మై తేనెలఁ జిల్కు మోవి గలయాతన్వంగివక్త్రాబ్జ మీ
ధరణిన్ సాధుపరోపకారము మదిన్ దల్చుంగృతజ్ఞుంబలెన్
అరయ న్నామది మర్వ దిప్పటికి సత్యంతానుభావ్యంబ వై. 105

ఉ. దీటు సెలంగఁ బంచశరదివ్యధనుర్గతమత్తభృంగరా
టోటిగరుత్ప్రభారుచిరకోమలకస్తురితాలకంబులన్
నీటుగుదంతపత్రముల నీలసరోరుహభూషణంబులన్
లూటిగ దానిమోము మదిలోఁ దలపోయుదు మాటిమాటికిన్.

శా. తెల్లం బై చిఱునవ్వువెన్నెలలచేఁ దెల్పొప్పులేఁజెక్కులన్
మొల్లం బై తగుచంచరీకములగోముం జెందుకన్దమ్ములం
బ్రోల్లీలాంకశరత్సుధాంశురుచి నొప్పన్ భామనెమ్మోము నా
యుల్లంబుం జివురింప నిప్పటికి నే నుప్పొంగి వీక్షించెదన్. 107

చ. దరము హసించుకంధర ముదారత వంచి కరాంబుజాతమున్
వరకటి సంఘటించి జడ వామభుజంబున గబ్బిగుబ్బచ
న్నొరయ వహించి నిల్వఁబడి యూరక నన్ను ననేకరీతులన్
వరమతిఁ జూచున త్తరుణి వర్ణన సేసెద నే ముదంబునన్. 108

ఉ. నే నపరాధి నై యడరి నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోడుతం బడినఁ బోవఁగఁ ద్రోచి చరించుచున్నన
ద్దానిచెఱంగు వట్టిన నుదాత్తత నిగ్గుక కోప మయ్యెడన్
మానక యున్నదాని వరహాసిని నాత్మఁ దలంతు నెంతయున్. 109

చ. సరిగాని నేల నేలుసువిశాలనితంబము లొప్పుదాని మేల్
సరసులలోఁతుఁ గాంచి బలుసమ్మతముం గనునాభిదాని మం
థరగతి గల్గుదానిని మృణాళసమానవిలాసబాహువుల్
బరఁగినదాని నెన్నెదను భావమునం దనుమధ్య నెప్పుడున్. 110

ఉ. అప్రతిమానబోధ సురతాంతమునందు నిమీలితాక్షి యై
శ్రపఁపుఁదావి మాటికిని గ్రమ్మఁగ నూర్పులవేఁడి వాడి గం
డప్రరుచిన్ శ్రమాంబువులు దార్కొని రాలఁగ నొప్పుదాని నే
నాప్రియురాలిమోము సుమనస్స్థితి నెప్పటికిం దలంచెదన్. 111

ఉ. నా యెడ నొక్కమాటయు మనంబున భావన చేసి మాటకీ
డాయక యంతరంగమునఁ దా సరికట్టుక కోపభావనై
యాయతబాష్పకంఠ యయి యప్పటియూర్పుల మోవి గ్రాఁగఁగాఁ
జేయఁ బొడంగె రోదనము చింతన సేయుదు దాని నెంతయున్. 112

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం దేవ్యాస రా కుండఁగా
నాకంజేక్షణ దర్శనంబుఁ గొని వీక్షాసక్తి నుండంగ నే
జోకన్ వ్రేక వసింప మత్ప్రతినిధిం జూ చెంతయు న్సిగ్గుతో
నాకంపించి భ్రమించి మించె మదనోద్యన్మానసాంభోజ యై. 113

చ. మఱియు సుగంధయుక్త మయి మంజుల మైతగు మోముఁదమ్మిపైఁ
దిరిగెడు గంధలుబ్ధ మగు తేఁటిగమిం గనుదోయి మాటికిం
దెఱచుచు మూయుచు న్మొగము ద్రిప్పుచుఁ గేలిసరోరుహంబుచేఁ
దఱుముచు నొప్పునప్పొలఁతి ధ్యానము సేసెద నెట్టివేళలన్. 114

మ. ఒకనాఁ డొక్కెడ శ్రోణిపై వలువ జాఱుండంగ నే సంతలో
సకలంకస్థితిఁ బోవ సిగ్గుపడి యాహా యంచుఁ దా విహ్వలాం
గకయై భీతిని నొక్కచేత మదనాగారంబు వే మూసి వే
రొకచేఁ బొక్కిలి గప్పునప్పడఁతి నే నూహించి ప్రార్థించెదన్. 115

చ. అటు నిటు ముందు వెన్క బహి రంతరసీమల నన్నిదిక్కులన్
స్ఫుటతరకాంచనాంబురుహశోభితమంజులసుందరస్వయై
తటుకున వాలుఁజూపులను దా ననుఁ జూచుచు సంచరించున
చ్చటులవిలోచన న్మదిని సన్నుతి సేసెద నేఁ బ్రియంబునన్ 116

శా. ఆకర్ణాంతములై మదాలసములై యబ్జోపమానంబులై
శ్రీకల్యాణములై రమాపరసుతోద్రేకంబులై యైందవా
స్తోకాంశుప్రతులై మధువ్రతవిభాశోభాయమానంబులై
యాకంజాక్షివిలాసనేత్రములు నా స్వాంతంబునం దొప్పెడున్. 117

చ. సమయ మెఱింగి నేఁ దలుపుచాటున నుండఁగఁ గేలుఁదమ్మి న్మో
హమున మొగంబునం దిడి మదాగమనంబుఁ దలంచి చూచుచుం
గ్రమమున మత్కులాంకపదకాండములన్ మృదుగీతిఁ బాడుచున్
రమణి మనోవికాస యయి రాజిలు దాని మదిన్ భజించెదన్. 118

చ. కలువఁ గేరుకన్నులను గాటుకరేకలు దీర్చి చెక్కులం
దలరఁగ జందనం బలఁది యాపయిఁ గస్తురి కొంత పూసి ఫాల
తిలకము దిద్ది ముత్తెలదీటగుపాపటబొట్టమర్చి నా
యలికులవేణిముద్దుమొగ మబ్జునిగాఁ దలపోతు నెంతయున్ 119

మ. కొనగోళ్లన్ బిగిగుబ్బ లొత్తి కురులుం గూడంగఁ జేపట్టియున్
మొనపంటం జిగురాకుమోవి గొన నోము న్నాటి రోషాత్మ యై
కనుఁదమ్ముల్ మొగిడించి యుస్సురని సీత్కారంబుఁ గావించుచున్
ననుఁ గోపించువధూటిమోము మది సన్మానంబు గావించెదన్. 120

చ. స్మరజనకంబు లై యమృతసారము లై శ్రుతిరంజనంబు లై
యరయ మృదూత్తరంబు లయి యందములై మదికింబ్రియంబు లై
కెరలుచు నోష్ఠపృష్ఠపరికీర్ణశుచిస్మితసంయుతంబు లై
పరఁగునెలంతవాక్యములు పట్టుగ శోభిలు నామనంబునన్. 121

చ. తనరఁగ నామదిం దరళతారనిమీలితలోచనంబు లై
యనుపమలిప్తచందనరసాహితపాండురగండభాగ మై
ఘనమృగనాభికాకుటిలకల్పితపత్త్రలతాభిరామ మై
యను వగుసుందరీమణిముఖాబ్జము నిల్పెద వేడ్క మీఱఁగన్. 122

చ. మఱియును గర్ణపాళిని సమంచితకాంచనకుండలంబులున్
మెఱయఁగ గబ్బిగుబ్బచనుమిట్టల ముత్తెపుఁబేర్లు రంజిలం
బిఱుఁదుఁ గాంచియొప్పు మురిపెంబున నందెలు మ్రోయ వచ్చునా
మెఱుఁగుమిటారి నెన్నెదఁ జామీ మది నెప్పటికిన్ హితంబుగాన్.

ఉ. సందిటిపోయి నామెడను జక్కఁగ నిల్పుచు నిక్కిమిన్న లై
యందము లై చెలంగుతనయుబ్బురపుబ్బుమెఱుంగుగుబ్బలం
బొందుగ నాయురంబునను బూన్చి మొగంబున మోముఁ జేర్చి న
న్నుం దగఁ జూచునెచ్చెలి మనోహరమూర్తిఁ దలంచి చూచెదన్.

చ. కురులు భుజాగ్రభాగమునఁ గూడి నటింప గళంబు లీల మై
నొఱగఁగఁ బెట్టి రైకబిగి నొయ్యనఁ గాంతులు జీరువాఱఁగా
మెఱుఁగుమిటారిగుబ్బ లెలమిం గనుపట్టఁగ నన్నుఁ జూచున
గ్గరితయరాళదృష్టు లెదఁ గాంక్ష దలిర్పఁగఁ దేజరిల్లెడున్. 12

చ. అలరఁగఁ గోమలారుణకరాంగుళిముల్ దలపై ఘటింపుచో
వలయముగా భుజాలతలు వాంచి దృఢాంగవివర్తనంబులన్
వెలయుచు నుండఁగా సపరివేషసుధాకరకాంతి నొప్పున
ప్పొలఁతుకమోము నామదిని బూని భజించెద వేడ్క మీఱఁగన్.

ఉ. తా నొకనాఁటివేకువను దల్పమునన్ శయనించి యుండఁగా
నే నట లేచి లేపఁగను నిద్రతమిన్ వెస నాకులత్వముం
బూనినరీతి నా వెనుకఁ బొల్పుగ మోము మిడి కౌఁగిలించున
మ్మానిని నాత్మ నెప్పటికి మర్వక నే భజియింతు నెంతయున్. 127

మ. చనుదోయిన్ మొగమందు లేఁజెమటలున్ జాఱం గురు ల్చక్కులం
దనరం దూలఁగ హారము ల్చెదరి యాడం బైరతు ల్సేయుచోఁ
జను వొప్ప న్ననుఁ గాంచి లేనగవుతో శ్వాసోక్తుల న్మాటికిన్
గొనబై పల్కునధూటి నామదినిఁ గోర్కుల్మీఱ భావించెదన్. 123

మ. అలుకం బానుపుఁ బాసి వచ్చుటకు నే నత్యంతము న్వచ్చుటల్
వ్వల వెచ్చం దలపోసి కామవికృతిన్ ద్వారంబున న్నిల్చి సం
చలనం బందుచు నెచ్చెలిం గదిసి కాంతు ల్మీఱ నెల్గెత్తి కో
కిలవాగ్వైఖరి రోదనంబు గను నాకేళీసతిం గాంచెదన్. 12)

ఉ. ద్వారమున న్వసించి కడు దైన్యమున న్ననుఁ జూచిచూచి త
ద్ద్వారతలంబునం బడి శుగార్తిని డస్సియు నించుకంత ని
ద్రారతిఁ జెంది లేచి మది తల్లడిలంగ లసత్కపోల యై
యారయుచున్న నెచ్చెలిని నాత్మ భజించెద మాటిమాటికిన్. 130

మ. బలునిట్టూర్పులతోడ నేత్రయుగళి న్బాష్పాంబువు ల్రాల సం
చలతం జూచుచు నావిధం బడుగుచున్ స్వాంతంబు నానావిధం
బులఁ బోఁగా మదనుండు పైకొనఁగ మోమున్ వాంచి చింతించున
బ్బలభిన్నీలశిలాకచన్ మదిని నే భావింతు నెల్లప్పుడున్. 131

ఉ. వేకువ నొక్కనాఁడు నిజవేశ్మమున న్నెఱిగొప్పు వీడఁగాఁ
గోకిలవాణి యున్మిషితఘూర్ణితదీర్ఘవిలోచనాబ్జ యై
తేఁకువ నిద్ర లేచి రుచి దేఱఁగ నొక్కినమోవి కేలిచే
నాకర గప్పెఁగా నది మహాత్మను నెప్పటికిం దలంచెదన్. 132

చ. మఱియొకనాఁటిప్రొద్దునను మానక పంచటరంగుపైని దా
నిరవుగ నెచ్చెలిం గదిసి యేవొ ప్రియోక్తులు పల్కుచుండ నేఁ
బరువున వచ్చి వెన్క నిలువంబడినంతనె చూచి సిగ్గుతోఁ
జెఱఁగున వొప్పఁ బోవుచెలిఁ జిత్తమునం దలపోసి చూచెదన్. 133

మ. అపరాధం బొనరించి తీ వనుచు న న్నత్యంతకోపంబుతో
నుపలాలింపక నెమ్మొగం బియక యోహో చాలుఁజా లంచుఁ బో
నపుడు న్నేను ప్రియోక్తి నాముకొన సత్యాసక్తి లేనట్టిమా
ట పచారించినయవ్వధూటిఁ గవుఁగింటం జేర్చి లాలించెదన్. 134

చ. పడుకొని యంతలోనఁ బరిభావిత యై వడి లేచి నిద్రచేఁ
బొడిఁబడ నావులించి మెయి బొట్రు విదిర్చి విజృంభణక్రియం
బొడమినమోమువాసనకుఁ బూని భ్రమించుచునున్న తేంట్లసం
దడికిఁ జలించునట్టికనుఁదమ్ములు గల్గినదాని నెన్నెదన్. 135

చ. మనసిజపూజ సేయ నిజమానిను లందఱుఁ గూడి కేళికా
వనమున కేగుచోఁ దనదుపార్శ్వమునన్ ననుఁ జూచి యంతలో
ననసినశంకతోడ జను లే మనుకొందురొ యంచు భీత యై
క్షణ మిటు లుండు మంచుఁ గనుసన్నలు సేయువధూటి నెన్నెదన్.

చ. సరసిజనేత్ర దాఁ బ్రథమసంగమవేళను సిగ్గు దోఁప నే
నరయుచు ధైర్యవృత్తిఁ గదియంగఁ దలంచినఁ జూచి పూత్కృతుల్
నెఱపఁగ నందు దీపశిఖ లీసతఁ గంపము నొందుకర్ణభా
సురకుముదంబుఁ గప్పుసతిఁ జూచెద నెప్పటికిన్ ముదంబునన్. 137

చ. చెలి తమితోడ నెచ్చెలుల నీ యని కోపము సేసి శీఘ్రితం
దలతల మంచుఁ బోఁ గదిమి తత్పరతం బులకల్ జనింపఁగా
నలరుచు సస్మితాస్య యయి యంతట నాదెస వచ్చి కూటమిం
గలసినభామినీమణిని గాంచెదఁ గన్నులకర్వు దీఱఁగన్. 138

మ. కలకంఠోపమకంఠి నాస్యజితరాకాచంద్రబింబ స్మయా
కలసద్భ్రసమానవేణి సుగుణవ్రాతాత్మ నేత్రప్రభా
విలసన్మత్తచకోర యానవిజితశ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభస్తని గామినీమణిని నే భావింతు నెల్లప్పుడున్. 139

మ. విరిసెజ్జం బవళించి మన్మథమదావిర్భూతి కంగంబులన్
సరి గావింపుచుఁ గౌఁగిలించి ముద మెచ్చ న్నాదు కెమ్మోవి సుం
దరవక్త్రంబున నిల్పి పై సురతసంధానంబు గల్పించుచుం
బరివిద్వ్యద్ధ్వజవైజయంతి మది సంభావించి ప్రార్థించెదన్. 140

ఉ. సిబ్బెపుగబ్బిచన్నుఁగవ చెన్నుగ నిక్కఁగ నక్కళించి యం
దబ్బురపాటు గన్పడఁగ నంగవిభంగమిషంబునన్ రుచుల్
గుబ్బతిలంగ బాహులతలుం బయికెత్తి గభీరనాభి వె
ల్లుబ్బినవేడ్కఁ జూపుచెలి నుల్లమునం దలపోసి చూచెదన్. 141

చ. వరుస వివర్తితంబు లయి వ్రాలునపాంగవిలోకనంబులన్
మరుదశనోపమానమృదుమంథరమంజులభాషణంబులన్
దరమధురస్మితంబులను దాళిమియానములన్ విలాసతన్
సిరు లెసఁగంగ నొప్పుచెలిచేష్టలు నామది సంస్మరించెదన్. 142

చ. కనుఁగవ యించుకంత నెఱిగా నొనరించి సరత్నపాణికం
కణములఝుంకృతిధ్వనులగౌరవ మొప్పఁగఁ జన్నుదోయి ని
క్కను గనుబొమ్మ లెత్తి నిజకైశ్యము చక్కఁగ మెచ్చొనర్పుమా
నినిఁ బలుమాఱు నెప్పటికి నే మదిలో భజియింతు నెంతయున్.

చ. అరయ సహింప రానివిరహార్తిని జెందినదై రయంబునన్
సురతవిశేషసంగతులఁ జొక్కపుతాండవసూత్రధారి యై
తరమిడి యంగమంగమును దాఁకఁగఁ గౌఁగిటఁ బట్టి కన్నుదో
యర యిడి చొక్కు నొక్కసతి నాత్మ భజించెదఁ గోర్కి మీఱఁగన్.

చ. విలసితమన్మథన్ విరహవిహ్వలలాలసగాత్రి సుందరిన్
లలితకురంగనేత్ర సువిలాసరసాంచితచారుకాంచనో
జ్జ్వలమహనీయచేలయుత శ్యామ విరాజితహంసయాన నే
నలవడ సంస్మరించెద ననారతమున్ మదిలోన వేడుకన్. 145

చ. మలయగిరిప్రభూతపవమానములం గని తీవ లాడఁగా
సలలితరత్నవేదిపయిఁ జక్కఁగఁ దా వసియించి గీతముల్
దలకొని వీణ సుస్వరయుతంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లలి నయనోత్సవం బొసఁగుల్లక్షణగాత్రిని నే భజించెదన్ 146

వీరసేనుండు కవి రచించుపద్యంబులు రాజునకుఁ బంపుట.

వ. అని యిట్లు కవివరుండు మదనోన్మాదంబున యామినీపూర్ణతిలకా యత్తచిత్తుండై తద్వర్ణనాతివిశేషంబులుగా రచించినపద్యంబులు లిఖింపం జేసినవీరసేనునియనుమతంబునఁ దద్భృత్యులు భూపాలుని కప్పటప్పటి కర్పించినం జూచిచూచి యంతకంతకుఁ గోపాటోపంబునఁ గసరివేయుచున్న విసికివిసికి తద్వృత్తాంతం బంతయుఁ గవివరుండు విన వీరసేనున కిట్లనిరి. 147

చ. హిమరుచిసత్కళావిభవుఁ డీకవిరాజు రచించునట్టిప ద్యములు గ్రహించి భూవిభున కర్పణ సేసినఁ జూచి కోపభా వమున దురుక్తులం బలికి వారక పొమ్మనుఁ గాని మంచిమా టమరఁగఁ బల్కఁ డప్పుడు తదాగ్రహవృత్తి వచింప శక్యమే. 148

చ. అనవుడు వీరసేనుఁడు తదాననముం గని యోకవీంద్ర నీ వనఘుఁడ విందిరావరసుతాభుఁడ వౌనిను హింస సేయఁగా మనమున సత్కృపామతిని మానితిఁ బూనితి నే భరింపఁగాఁ బనివడి వ్రాయుపద్యములు పార్థివుఁ డొప్పఁ డిదేమి సెప్పుమున్. 149

చ. అనవుడు భూసురుండు హృదయాబ్జమునం గడు నవ్వి యోరి ని న్ననయము మెచ్చితిన్ విను ధరాధిపుమానసముం గరంగునే పనివడి యేల పంపితివి పాల్పడి నా కయి బ్రహ్మదేవుఁ డి ట్లను లిఖియించి యుండ వెతలం బడఁ గారణమేమి చూడఁగన్.

ఉ. ఓరి తలారి వీరి మఱి యూరక త్రిప్పకు మేమి త్రిప్పఁగా సారము ఖడ్గముం గొని విచారము సేయక త్రుంచు మన్నఁ ద ద్ధీరతఁ గాంచి వాఁడు క్షితిదేవకులోత్తమ యేతదర్థమై యారయఁ జాల నెంతపని కైన భరించుదు నిన్ను సెన్నఁగన్. 151

క. ఏమిమి వ్రాసితివో యా, భూమీపతిమానసంబు పొరలక పోయెన్ సామీ యీమా టైనను, సామోదత మంచిపద్య మాసతి యిమ్మా.

వ. అనిన విని సృష్టికర్త యైనస్రష్ట నుద్దేశించి. 152

సీ. తనసపృథ్వీ యాఘనాఘనవేణి చరియించు, క్షితిభాగమున నుండఁ జే యుమయ్య, తనరసం బాసుధాధరి క్రీడలాడఁ, శృంగారసరసిలోఁ

జేప్పుమయ్యా, తనతేజమూత ప్రకనకాంగి దర్శించు, దర్పణాంతరమున
దాప్పుమయ్యా, తనవాయు వానుగంధశ్వాస విసరించు, కొనువ్యజ
నంబునం గూర్పుమయ్యా

తే. తనసభం బారమణియింట నునుపుమయ్యా, యీశరీరంబు
పంచత్వ మొనసినపుడు, స్వాంశములతోడ భూతంబు
లైదునైదు, గూర్పుమయ్యా విధాత నాకోర్కి దీఱ. 153

వ. అని యిట్లు కమలభవుని వేఁడి త్రికరణపూర్వకంబుగ నమస్కరించి
నిలువంబడి యున్న వీరసేనుఁడు తత్పద్యంబు గ్రహించుకొని రాజ
సమీపంబునకు వచ్చి తత్పత్రిక సమర్పించిన. 154

క. ఇది యేమి మాటిమాటికి, హృదయంబున లేదె భీతి
యెంతయు నన వాఁ, డదురక సామీ భూవర,
యిది చూడుం డొక్కవింత యేమో తలఁపన్. 155

వ. అనిన లిఖితంబు చైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థంబనేకార్థం
బులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యిట్లనియె. 156

క. ఓరి దురాత్మక వినుమ పలు, మా ఱిటు రావలదు హెచ్చి
మఱి వచ్చితివా, నేరము గొందు గ్రహించుక,
యూరకె యాపని ఘటింపు మెప్పుడు మూకున్. 157

తే. అన నిరాశఁ దగుచు నావీరసేనుండు, వచ్చి పలికె
విప్రవరునితోడ, నేమి వ్రాసినావొ యొఱుఁగ నే
నింతైన, మనసు గరఁగ దయ్యె మనుజపతికి. 158

వ. అని పల్కిన వల యూఁచియూఁచి మఱినాహా యంచు వేసాహసం
బునఁ జాతుర్య మొలర్పఁగాఁ దనగతిక్షి భూమీశునుచ్ఛ్రాయము
గని రెం డొక్కటియైన మంచి నగుఁ గాకా యంచుని శ్నాదు చై
కని యూహించె శరప్రయోగ మయి తాఁకం బద్య ముద్యద్గతిన్. 159

కవిరాజు కోపశాంతికరం బైనయొకపద్యము వ్రాసి పంపుట.

రవిజుఁడు భా గుణింప విధురంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁ డడంగె దీర్ఘమునఁ బాణముఁ బాసె గు డియ్యె భిక్షుఁ డీ
యవనికిఁ దప్పె భీముఁడు తదంతిగతిం స్మృతి కొమ్ము వెట్టని.

కృపవముగ నే భుజంగుఁడను గొమ్ముని దీర్ఘము నెట్టు [illegible]
భువి సతిఁ జెన్న నిర్దయుఁడు భూపతి వీవు గలంచు భూపురా. 161

వ. అనునీపద్యంబు లిఖియించి వీరసేనున కిట్లనియె.

క. ఓపుణ్యాత్మక వినుమా, యీపద్యముఁ జే గ్రహించి
యిప్పుడు చని నీ, వేపున నొసఁగిన పేయా,
భూపతి సనుఁ బిల్వ నంపుఁ బొమ్ము రయమునన్. 162

వ. అని చెప్పిన నప్పద్యంబు గ్రహించుకొని పోయి రాజుముందట నిడి పెట్టి న నప్పత్రికఁ దంభధరాసిపుత్రికవిధంబున మదికిం దోఁపంజూచి తదర్థంబు గ్రహించి మహీవల్లభుండు పవనోత్కంపితకదళికామహీరుహాంబుచందంబునఁ గంపితసర్వావయవుం డై యెంతయుం బ్రొద్దు ఛింతించి తమభయదృఢతరస్నేహసారంబులును దత్కవితామహత్త్వంబును విచారించి వాని తో ని ట్లనియె. 163

రాజు కవిరాజుం బిలువఁ బంపి పుత్రి నూఱడించుట.

క. ఓవీరసేన యిచటికి, వేవేగం దోడితెమ్ము బిల్హణు నినఁక, భూపతియు
రంజిల వాఁడు ధ, రావిభునకు మ్రొక్కి వచ్చి రాసుత కనియెన్.

క. ఓతల్లి నీమనోహరు, నాతతసదయాంతరంగుఁ డై వసుధేశుం
డీతఱిఁ దోడుక రమ్మనె, నీతాపము మాను మింక నీరజనయనా. 165

వ. అనిన గ్రీష్మసమయదందహ్యమానమానస మైనమయూరిక ఘనాఘనగర్జానినాదంబు వినినచందంబున సుందరీమణి తద్వచనంబు విని కుతూహలచిత్త యై కంఠహారం బొసంగిన గ్రహించుకొని బిల్హణున కిట్లనియె. 166

ఉ. ఓకవిరాజశేఖర మహోన్నతి నీవు రచించుపద్యము
దేఁకువతోడ నానరపతిం గని యిచ్చినఁ జూచి యెంతయుం
గైకొని దానియర్థమును గాంక్ష దలిర్ప గ్రహించి యప్పుడ
స్తోకజవంబు మీఱ నినుఁ దోడ్కొని రమ్మనె నయ్య యియ్యెడన్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణాప్రశస్తం బగునతనిహస్తంబుఁ బట్టుకొని వచ్చునెడ. 168

తే. రాజతా జగుమదనాభిరామనృపతి, తనకుమారిని దలఁచి

యా హ్వాప మొదలి, వచ్చి లేఖ్వారమం మున్న
వనజపత్ర, నేత్రదగ్గఱఁ జేరి కన్నీరు దుడిచి. 169

తే. శిరము మూర్కొని చికురముల్ సిక్కు వాపి, చెక్కుఁగా నిడి
గద్గదస్వరముతోడ, సనియో దయ మీఱ భూపాలుఁ డాత్మజాత,
కమ్మ సంతాపమును మాను మమ్మ యనుచు. 170

క. ఓకరాత్మితనయ కవివరు, నీకోరిక మీఱఁ గూర్తు
నిశ్చలమతి నై. నాకడకును రానమ్మా,
యీతడ నాచేయుపని గ్రహింతువు మదిలోన్. 171

రాజు కవివరు నెదురుగాఁ జని తోడ్కొని వచ్చుట.

వ. అని యుపలాలించి యంతఃపురంబున కనిచి బ్రాహ్మణునకు నెదురుగాఁ
జని నమస్కరణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతురంతయానంబున న
ధివసింపం జేసి సభామంటపంబునకుం దోడ్కొనివచ్చి యుచితాసనం
బునఁ గూర్చుండనియమించినసభాసదులువిస్మయమందిరని కిట్లనియె.

ఉ. ఓ చతురాననాన్వయమహోదధిపూర్ణశశాంక బ్రాహ్మణా
ఖ్యా చతురాస్య నీమహిమఁ గన్గొన నేరికి శక్యమౌ ధరన్
నీచతురోక్తివైఖరికి నీద్విఫనృత్తికి నీకవిత్వధా
రాచలితైకనిష్ఠకు నహర్నిశముర్వి యది నేను మెచ్చితిన్. 173

రాజు కవివరు నూఱడించి తనకూఁతుఁ బెండ్లి గ మ్మనుట.

చ. తడఁబడి యొవ్వఁడేనియుఁ గృతఘ్నునియం దొనరించుమేలుకై
వడిని మదీయకృత్రిమము భవ్యగుణాకర నీమనంబునం
దడవక సుందరీమణినవతంసము నాతనయన్ వరించి యే
ర్పడ నయ మొప్ప మత్పురికి భర్తవు గ మ్మని పల్కి వెండియున్.

క. రేపు సమస్తంబుగుఁ గా, నీపాణిగ్రహణ బడలినాఁవు హితమతితో నీ,
వీపట్ల సేవ చేయుము, భూపాలసుతైకచర్య భూసురవర్యా. 175

వ. అని యొడంబఱిచి కవివరుని యుపభాస్థానంబున కనిచి వసంతాఖ్యున
కి ట్లనియె. 176

క. ఓమంత్రివర్య చూచితె, భూమీసురుచిత్తవృత్తిఁ బోలింపఁగా,
నేమందు నెంతప్రథ మా, భామామణిహృదయ మట్ల పరిశీలింపన్.

క. ఈవిధమున నిపుపురకుఁ, దైవాజ్ఞఁ ఘటనమయ్యెఁ దప్పింపంగా,
నావశమె యగ్రజన్ముఁడు, భావింపఁగఁ గూఁతు నిత్తు భవ్యవిచారా.

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నేతత్కార్యంబు విశేష కార్యం బనిన విని వారలం బనిచి యతఃపురంబుఁ బ్రవేశించి పరిచారికాజనంబులం బిలిపించి యి ట్లనియె. 179

క. ఓకాంతలార మత్సుత, కాకివివర్యాసకు
భోజనాదులు పూర్వం, బేకోలఁది విచారించితి,
రాకోలఁదిం జేయుఁ డనుచు ననిచి రయమునన్. 180

వ. తనదార యగుమందారమాలిక కాచందం బంతయుం జెప్పి యాయమ కానందం బాపాదించి భోజనాదికృత్యంబులు దీర్చి సుఖం బుండునంత.

ప్రాతఃకాలాభివర్ణనము.

చ. తెలతెలవాఱెఁ దూర్పు నలుదిక్కుల విచ్చెఁ దమంబు పక్షులుం
గలకలఁ గూసెఁ గోకములు గాంచె ముదంబు నుడుప్రజంబు ఖ
స్థలమున నాడకాడకును జాఱెఁ జెలంగి పదాయుధంబు లు
ద్గలగతి మ్రోసె వీచె వలిగాడ్పులు భూజను లుల్లసిల్లఁగన్. 182

సీ. కోకాంగనాగణశోకమారుతమిత్ర, ఘనతరజ్వాలలఁ గంటినాఁడొ,
విరహదుస్సహవధూవిపులనిశ్శ్వాసనోష్ణ, గంధవాహములచేఁ గమ
లినాఁడొ, బాధితపద్మినీపటలశుక్సంప్రాప్త, ఘోరపాపంబునఁ గుం
దినాఁడొ, జనదూరితాప్రాప్తజారచోరవ్రాత, శాపంబులనుగొంత
సమసినాఁడొ,

తే. యనఁగ దోషాకరుండు కళానుభూతి, దొరయు
వెన్నెలపులుఁగులఁ బొడరి యితఁడు, రేపు నేవేళ
కొదవునో మాప నేమొ, యనుచు నీఁక సారమంత వొల్లాడ నరిగె.

ఉ. వెన్నెలతీవలం దడఁగి వెల్వడి విస్ఫురసారసావళిం
గ్రన్నన సౌరభంబు గొని రాజిలుగంధసమీరణంబు ల
భ్యున్నతసౌధరాజములఁ బుష్పశరాసనకేళిఁ దేలి యం
దున్నవధూశ్రమాంబుతతు లొప్పలు మీఱ హరించు నెంతయున్.

మ. ముద మొప్పారఁగఁ బద్మినీఘనులు మోము ల్విప్పఁ జక్రంబు ల

భ్యుదయం బొంద సదాళులు౯ సరసవిస్ఫూర్తిం బ్రసర్తిల్ల నా
స్పద మై భాసిలుపుష్పదంతగజరాజం బెక్కి యువ్విద్విజుల్
మది రంజిల్లఁగ సన్నుతింపఁ బొలసె౯ మందానిలుం డత్తఱిన్.

మ. మలయాహార్యతటంబు డిగ్గి విలసన్మల్లీమతల్లీలతా
వళులం జిక్కి ప్రయాసత న్వెడలి దివ్యచ్ఛాయకాసారని
ర్మలతోయంబుల నీఁది పంకరుహసౌరభ్యంబుఁ గొల్లాడి ష
ట్పులనాదంబులతోఁ జరించు మృదుదక్షారంబు లవ్వేళలన్. 186

క. తనతమ్ములవైభవమును, గొనెనఁట యొకరాజు వానిఁ
గొట్టెద ననుచు౯, ఘనకోపుఁ డయ్యె ననఁగా,
నినుఁ డతితేజం బెసంగ నేతెంచె నొగిన్. 187

మ. హరి చక్రంబు ధరించి యుద్భటనిశాటాటోపముల్ మాన్చి యు
ద్ధురలీలాప్తి బుధాంకవర్తి యయి యొంతోపూర్వదేశంబు భా
సుర మై యొప్పఁగ నింపు సందు నిలిపె౯ స్తోత్రార్హుఁడై యంచు శం
కరపద్మోద్భవులు౯ భజింపఁ జెలఁగెం గల్యోదితాచార్యుఁ డై. 188

ఉ. అంగుగఁ గాల మక్కరికి నావల నీవల వ్రేలుబంధురా
భంగురపాశము ల్వోలయుబంగరుపోఁతలగంటలో యనన్,
సంగతి మీఱఁ బ్రాక్చరమశైలములం గనుపట్టె రక్తసా
రంగధరుల్ నిజోర్ధ్వపుచు లందము నొందఁగ నట్టివేకువన్. 189

క. హితవిబుధస్తుతి గోత్రా, హితకరుఁ డుదయించె
గురుబుధేశహితుం డై; ధృతిఁ బూర్వదేశముం
గొని, క్రతువులు గోతలమునందుఁ గడు నొప్పారన్. 190

సీ. అతులద్విజాలోకనావహుం డై త్రయీ, సుముఖుఁ డై నట్టితేజోమ
యుండు, కమలామనోహరాకారుఁ డై శర్వరీ, చరుల నొంచినచక్ర
ధరణశాలి, యఖిలలోకతమోపహరణాసై పుణ్యవృత్తి, రాజిల్లునట్టిస
ర్వజ్ఞవిభుఁడు, మిత్త్రుఁడై భువనపవిత్రకరుం డై తగ, ధర వెలింగించు
సన్మార్గవర్తి

తే. యాదిమూర్తి యనంగఁ బద్మాప్తుఁ డనఁగ, నార్జితాఖ్యుఁ డనంగ
దివ్యైకవాక్ స్థ, వముల ద్విజరాజసంగతి వసుమతింబ్ర,

శేఖరారూఢతను రవి చెలఁగె నెదుట. 191

తే. అలరుతమ్ముల నొకటిగా నాత్మఁ దలఁచి, దిశలు వెలుఁగొందఁ
దమము భేదించి తనదు, లోకబాంధవవిఖ్యాతి లోకు లెన్నఁ,
గరము వెలుఁగంగఁ బద్మినీకాంతుఁ డలరె. 192

క. ఉరుకువలయంబు బెగడఁగ, ఖరకరుఁడు జనించి రాఁగఁ
గలుగుసదాళిన్, వరుసఁ గని రూపు మాపఁగ,
సరిగెను ద్విజరాజు పశ్చిమాంబుధికడకున్. 193

చ. సమయకిరాటకుం డుదధిజాడల వచ్చుచుఁ జేరి పూర్వది
గ్గమణికి విక్రయించుదయరాగప్రవాళపటంబు విచ్చి చూ
పె మదికి పూర్ణమైన నడి బేరము లాడి నిబద్ధమైనని
ష్కము నొకటిచ్చెనో యనఁగఁ జాయలు దోఁప నినుండుఁ జెల్వగున్.

తే. ఒక్కయినుఁ డంతకంతకు నుక్కు మిగుల, నొక్కరాజది సూడంగ
నోర్వలేక, డింది వెల్వెల నై యొక్క గొంటఁ జేరె,
ననఁగ సూర్యుండు హెచ్చె హిమాంశుఁ డడఁగె. 195

చ. సమయవినోది మిన్నెనెడిచక్కనిరంగమునందు సర్వది
గ్గమణులు చూడ గారడము రక్తినిఁ జూపగఁ జంద్రుఁ డన్నయ
ద్దము నొకకర్ణమందునిచి దాపలికర్ణమునందు హేమచ
క్రము వెడలంగఁ దీసె ననఁగా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై. 196

రాజు దనకూఁతును గవికిచ్చి పెండ్లి సేయ నమకట్టుట.

వ. ఆసమయంబున నంతకుమున్న మంగళతూర్యనాదంబులు వినుచు మేల్కని మదనాభిరామభూమీధవుండు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి సముచితాలంకారుండై సభాస్థలంబునకు వచ్చి మంత్రిపురోహితామాత్యబంధువిద్వజ్జనంబుల రావించి వారల నుచితాసనంబులం గూర్చుండ నియమించి సుప్రసన్నుండై యిట్లనియె. 197

క. ఘనులార బిల్హణాఖ్యున, కెనయఁగ మామకకుమారి నీవలె
నని నే, మనమునఁ దలఁచితి నిప్పుడు, ననుకూలత
బ్రహ్మ పూర్వమందె ఘటించెన్. 198

వ. అని యిట్లు పలికిన వారలందఱు నుమతంబున ముహూర్తనిర్ణయంబు

సేయం దలంచి జ్యోతిశ్శాస్త్రకోవిదులఁ బిలిపించి యడిగిన వార
లి ట్లనిరి. 199

క. గురుకవియుక్తి నిసుంధుక్, వరుస నమందాత్ముఁ డగుచు
వసుధఁ బరఁగినం, బరికింపఁగ ద్విజరాజుకుఁ,
జిరతరముగ మంగళాప్తి చెన్నగు వేడ్కన్. 200

తే. నీకుమారిక యళి యమ్యె నాకపేంద్రుఁ, డలర ధను వమ్యె
నిన్వర కనుగుణంబు, గ్రహవిరోధంబు లెందులఁ గానఁ
బడదు, రాజబల మొప్పు నొప్పుఁ దారాబలంబు. 201

క. ఈకన్య కిపుడు, ద్విజరా, జాకడ నాఁటంటఁ జెల్వ మలరినవాఁ డై,
చేకొని పదిటను మిత్రత, శ్రీకరముగ నొప్పు నతనుసిద్ధి నృపాలా. 202

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుం డై నృపపుంగవుండు నిజనగ
రం బలంకరింపం జేయుం డని పరిచారకులం బంచిన. 203

సీ. పచ్చలతోరణపంక్తులు ఘటియించి, కస్తూరిపూఁతలుగా నొసర్చి,
మలయజపంకంబుఁ జిలికి జవ్వాది రే, కలు దీర్చి రత్నవేదులు
నమర్చి, ముత్యాలనవరంగముల రంగు గావించి, నవవజ్రమయవి
తానములు నెఱపి, వాసితాగరుధూపవాసనల్ నిగిడించి, పగడాల
మెఱయుచప్పరము లునిచి

తే. ప్రతిగృహంబుల భద్రకుంభములు నిలిపి, దర్పణంబుల ద్వార
బంధములఁ గూర్చి, ధవళసౌధాళిఁ జిత్రకేతనము లెత్తి,
పురము శోభిల్లఁ జేసి రబ్బురము గాఁగ. 204

సీ. ఏవీథిఁ జూచిన నింపుమై మంగళ, తూర్యనాదములు సంతోష మొ
సఁగ, నేచాయఁ గాంచిన హితముగాఁ జెవులకు, వీణారవంబులు
వేడ్క సేయ, నేపట్టుఁ గనిన భేరీపటహాదికా, హళమృదంగైకవాద్య
ములు వెలయ, నేచోటు వీక్షింప వాచాచమత్కృతిఁ, బాటలు
మాటలుఁ బరిఢవిల్ల

తే. నొప్పునక్షత్రవల్లభాభ్యుదయమునకుఁ, జెలఁగి మున్నందియుబ్బిన
జలధికిరణాల, వనజుం గవిరాజశుభమహోత్సవమునకును
నగరజనంబు సంతతానంద మొందె. 205

క. అ త్తరి నయిమువ లారతు, లెత్తుచు ధవళములు పాడ నిరిపు
దలిర్పం, గ్రొత్త గనుపింపఁ బెండిలి, చిత్తరు
చవిక కరుదెంచె క్షితిసురుఁ డెలమిన్. 207

సీ. ఈధామనిధికరం బెనయంగ నలుఁ గిడ, నేర్తువు పద్మినీ నీవు రావె
యీకళానిధిఁ జేరి యెలమి సేవలు సేయ, నేర్తువు మృదుహస్త నీవు
రావె, యీచతురాస్యుతో నింపుమైఁ బలుకంగ, నేర్తువు శుభవాణి
నీవు రావె, యీమహాసర్వజ్ఞు కిర వొందు శిర సంట, నేర్తువు శశి
రేఖ నీవు రావె

తే. యనుచుఁ దమలోన భూమిపాలానుమతిని, సరససల్లాపవచన
రచనలు దెలుపు, నంగనారత్నములు గొంద ఱాసువర్ణ,
గాత్రుఁ గదియుచు మంగళారాత్రిక లిడి. 208

క. మంగళము రాజసుతునకు, మంగళ మంబుజముఖీరమాతనయునకున్
మంగళము శాస్త్రవేదికి, మంగళము కవీంద్రమౌళిమణికిసుగుణికిన్.

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున నక్షత లునిచి. 210

చ. నడు మసియాడఁ జన్నుఁగవ నాట్యము సల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ దార్కొన వేణి చలింప నెమ్మొగం
బౌడలును జెక్కుటద్దములు నొయ్యఁ జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ ముప్పతిల్ల నొకభామ తలంటెఁ గవీంద్రమౌళికిన్. 211

తే. గందపటకలిఁ దలఁ బులి మంద మైన, బంగరుకటాహ
ములలోనఁ బొంగుజలముఁ, బొట్లు గావించి బిందియ
ల్పట్టి యొక్క, యతివ సుకవికి మజ్జనం బార్చె నపుడు. 212

సీ. తడి యార్చి వలువ లేర్పడ నిచ్చె నొకలేమ, యుదుటుపావా లుంచె
నొక్కభామ, పువ్వులు సిగఁ జుట్టెఁ బోలు పొంద నొకకొమ్మ, ముదు
వులు నిడె నొక్కముద్దుగుమ్మ, కస్తూరితిలకంబు ఘటియించె నొకజా
ణ, యొడల గంద మలందె నొక్కచాన, చొకట్లుపోగులు సవరించె
నొకబాల, యురుహారములఁ బూన్చె నొక్క గోల

తే. పసఁతి రత్నపుటుంగరాల్ దొడిగె నొకతె, వెలఁది కస్తూరంపు
సురఁటిచే విసరె నొకతె, నిలువుటద్దంబు ముందర
నిలిపె నొక్క, సుగుణ బిల్హణకవిశిఖామణికి నపుడు. 213

క. ఈరీతిఁ గవిని జెలు లిం, పారఁగఁ గయిసేసి నృపవరాత్మజ కెంతో
నీరాట మొనర్చిరి శృం, గారించిరి వేడ్క వాడమ గ్రక్కున నంతన్.

క. సరిగంచుచీర కటిపై, సెఱియంగాఁ గట్టి రైక నీలై మెఱయన్
సరిగుబ్బలు గుబ్బతిలం, గరముగ సవరించి పైఁట గావించి రొగిన్.

క. ఇఁకఁ జిక్కు వాసెనే యని, చికురంబులు చిక్కు దీర్చి చెలువుగఁ గీల్గం
టౌకయింతి వెట్టి నవ్వుచు, సకి ముడి బాగుపడె ననుచు సన్నుతిసేసెన్.

తే. సూర్యచంద్రులు మైత్రిచే సుదతివదన, వనజ మంతయు సంతత
నై భవంబు, నందఁ జేయ వసించిరో యనఁగ నపుడు,
సూర్యచంద్రుల నిడె నొక్కశోభనాంగి. 217

ఉ. కోరిక నాకలిం గొని చకోరికలున్ జన ముప్పతిల్లఁగా
సారసవైరియం దమృతసారము దూటుచుఁ దోనె తద్గతం
బై రహిఁ మించునల్పు గొన నత్తఱి జాతె ననంగ నొక్కసిం
గారపుబొమ్మ వాలుఁదెలిగన్నులఁ గాటుక దీర్చె జోటికిన్. 218

తే. తారకావళిసేవ్యమై తనరుసట్టి, చంద్రబింబంబుతోడుత
సాటి సేయఁ, జెలువమోమునఁ గస్తూరితిలక మునిచి,
ముత్తెములచేస లమరించె ముదిత యొకతె. 219

క. అద్దములవంటిచెక్కుల, నిద్దపురుచు లుప్పతిల్ల సీటుగ
శ్రుతులన్, ముద్దులగుమ్మకు నొక్కతె, ముద్దియ
కుండలము లునిచె ముద్దులు గులుకన్. 220

క. సంగతిగ మోవి చవిఁ జూ, డం గవి యరుదెంచె ననఁగ
డాక్కొనునాసన్, రం గలర నాణిము త్తెపు,
ముంగఱఁ గీలించె నొకతె ముదితామణికిన్. 221

క. దరము వివరం బెఱింగియు, పరుసం దనజన్మసీమ వారిని
వేడ్కన్, భరియించె ననఁగ నొక్కతె, యురఁకుచ
మెహ ముత్తెసరులు నునిచెం బ్రేమన్. 222

క. స్ఫుటముగ నీయుత్సవమునఁ, గటకంబుల మ్రోసె ననుచు
ఘనమణిభాస్వ, త్కటకమ్ము లునిచె నొక్కతె,
కుటిలాలకకరములందుఁ గోమలి నెంగన్. 223

క. పిఱుఁదులు ధర గొని దివ్వుల, నిర వొందఁగ నాక్రమించి
యేర్పడె ననుచున్, బిస దుంచినగతి యొక్కటై,
యొరయఁగ రత్నములకాంచి యునిచెం జెలికిన్. 224

క. కరిగమననడలు మదనుని, కరిగతులన్ ధిక్కరింపఁ గల వని
యందెల్, సరి మ్రోయఁగఁ జరణంబుల, నరు
దారఁగ నిలిపె నొక్కయతివ ముదమునన్. 225

క. ఈవిధమున రమణీమణి, లావసుధావధునిపుత్త్రి కంచితలీలన్
వేవేగ నలంకారము, గావించి వివాహవేదికడ నిల్పుటయున్. 226

సీ. సతివీక్షణములు రసప్రవర్తకము లై, నెమ్మోముఁదమ్మిపైఁ గ్రమ్మి
కొనఁగ, బిసరుహేక్షణదృష్టులు సుమనోహరము లై, గళసుగంధవి
శేషకలనఁ బొదలఁ, దరుణాంగిచూపుల త్తతి శిలీముఖము లై, హృ
దయపంకజ మావహించి నాట, భామినీలోచనప్రభలు వరాళు లై,
తనరారుపాదపద్మముల వ్రాలఁ

తే. బరఁగి కవిరాజు పూర్వశైఖరిని మోహ, కలితవిభ్రమవిస్మ
యాక్రాంతుఁ డగుచు, ననితరాయత్తచిత్తుఁడై యాత్మలోనఁ,
జెలువభావంబు గాంచి వీక్షింపుచుండె. 227

సీ. ఈసర్వమంగళయీక్షణకాంతులు, భరితసుధాకరప్రభలు గాఁగ, నీ
శ్యామకన్దోయినింపారుదీప్తులు, పూనినరతికాంతుభూతి గాఁగ, నీసతి
కన్నుల భాసిల్లుదీధితుల్, పొలుపొందఁ దమ్ములపూజ గాఁగ, నీయా
ర్యలోచనచ్ఛాయలు మాళిపైఁ, బ్రవహించుగంగాఝురంబు గాఁగఁ

తే. బరఁగుకవిరాజమాళి సర్వజ్ఞమూర్తి, విలసదసమాంబకస్ఫూర్తి
విశదకీర్తి, యంచితాచలభోగభాగ్యైకవర్తి
యనుచు నచ్చటివిబుధాళి యభినుతింప. 228

సీ. భావిఫలోదయప్రాప్తభాసురము లై, పరఁగుమౌక్తికములబారు ల
నఁగ, రతిపంచశరులు సంతతకేళిఁ దేలుచుఁ, బనివడి యాడుపూబంతు
లనఁగఁ, దియ్యవిల్తుఁడు రెండుతెఱఁగు లై యిరవుర, కడలందివేయు
మార్గణము లనఁగఁ, దనవలనను వీడ దనరారి రనుచుఁ జం, ద్రుఁడు
సల్లునమృతబిందువు లనఁగ

తే. వెలఁగు యామినీపూర్ణతిలకబిల్హ, ణాఖ్యకవివర్యచూపు
లన్యోన్యమైత్రి, నోలయుచు గతాగతంబులై కలయ
సడరి, వెలయఁ జూచినజనులకు వేడుకయ్యె. 229

తే. లలితముగ విప్రులు "తదేవ లగ్న" మనుచు, మంత్రములు పాడ
శుభక్షితి మహితలీల, వరుస నుంచిరి యవ్వధూవరుల
నృపతి, యనుమతంబున నైదువ లపుడు వేడ్క. 230

తే. పుడమివేల్పులు పుణ్యాహపూర్వకముగ, దేవతాహ్వాన మొనరించి
తివిరి వారి, కరములను గంకణములు వేడ్కను ఘటించి,
చదివి రంతయు మంగళాష్టకము లపుడు. 231

మ. పొలు పొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చుపగిదిన్ జ్మానాథముఖ్యంబుగాఁ
బొలు పొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్య నిచ్చె సుమనస్సంతానముల్ మెచ్చఁగన్.

క. తలఁబ్రాలపళ్లెరంబులు, వెలఁదులు పార్శ్వములఁ బూన
విభునిశిరమునన్, జలజాక్షి ముంచి పోయిటఁ,
దలఁబ్రాలను బోసె విభుఁడుఁ దనపై నుంచెన్. 233

వ. ఇట్లన్యోన్యాతిశయంబునఁ దదుత్సవంబు గావించి విధ్యుక్తప్రకారంబుగఁ బ్రధానహోమంబు లాదిగాఁ గలవి యాచరించి బంధుసహితంబుగా భోజనాదికృత్యంబులు నెఱపి తదనంతరంబున శేషహోమాదికృత్యంబులను నిర్వర్తించి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనరాజంబులు గైకొని బిల్హణుండును యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబు లనుభవించునెడ. 234

సీ. నీలమేఘంబులు శైలాగ్రముల వ్రాలెఁ, బరికింప వెల్వెలఁ బాగ
విధుఁడు, సన్నగిల్లెను బికస్వరము లంతంతకుఁ, గలహంసగతులసంగ
తులు దప్పె, గగనమార్గము సావకాశమై బలు పొందె, నహిరాజు
రూఢి యందంద నిలిచెఁ, గేతకీదళములు గేలఁకుఁ భాసిల్లె, మెఱుపుఁ
దీఁగలు మింటఁ దఱుచు మెఱసె

తే. నంద మొప్పఁగఁ గొలఁకుల నంబు వాడమి, నాడకాడకుఁ గోరిక
లతిశయిల్లె, ననుచు జను లెల్లఁ బొగడ ఘనాగమమున,
గర్భగౌరవ మాకాంత గాంచె నంత. 235

వ. ఇట్లు నవమాసంబులు నిండ దశమం బగుమాసంబునం బొక్కసుము
హూర్తంబున. 236

మ. మరుదంకూరము సంచరింప గ్రహముల్ మార్తండయోగమ్ములో
నెఱయన్ దిక్కులు దెల్విఁ జెంద గరిమ న్దివ్యస్వ్రదంగాదివా
ద్యరవంబుల్ సెలఁగన్ సురప్రతతి యుద్యత్పుష్పవర్షంబుల
త్తతి వర్షింప వధూటి గాంచెను సుతున్ ధైర్యైకభాగ్యోన్నతున్.

క. ఘనతం బ్రభాకరోదయ, మున జనియించుటయు విప్ర
ముఖ్యులు వేడ్కఁ, గని లగ్నగతిఁ బ్రభాకరుఁ,
డనునామం బిడిరి బిల్హణాఖ్యుఁడు మెచ్చన్. 238

వ. అప్పుడు మదనాభిరామభూమీధవుఁడు విద్వజ్జనబంధుమిత్రపురోహి
తామాత్యసమక్షంబున నతనిం దనవంశకర్తగాఁ బరిగ్రహించి జాత
కర్మాదులు సలిపి గోభూతిలహిరణ్యాదిషోడశదానంబులు సేసి భూసు
రాశీర్వచనంబు లంది. 239

క. ఘనుఁడు ప్రభాకరుఁ డంతన్, దినదినమును వృద్ధిఁ బొంది
దీవ్యద్బలుఁడై, కనుపట్టవానిఁ బట్టము, చన వొప్పఁగఁ
గట్టి సుఖము జయముం గాంచెన్. 240

మాలిని. ప్రథితగుణకలాపా భంజితేశానచాపా
ప్రథనవిజయకోపా భానుకోటిప్రతాపా
మథితదనుజదీపా మన్మథాచ్ఛస్వరూపా
మధురతరకలాపా మాన్యరామావనీపా. 241

గద్యము. ఇది శ్రీసీతారామచరణసేవాప్రభావసంప్రాదితకవితావిచిత్రకా
శ్యపసగోత్రపవిత్రశ్రీమత్పండిపెద్దిక్రిష్ణస్వామిప్రణీతంబయిన బిల్హణోపా
ఖ్యానం బనుమహాప్రబంధంబునందుసర్వంబును ద్వితీయాశ్వాసము
శ్రీకామేశ్వర్యర్పితము.

# శుద్ధపత్రము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 15 | సింఘుర | సింధుర |
| 11 | 19 | జెలగు | జెలంగు |
| 12 | 21 | పాలిందు | పాలిండ్లు |
| ,, | 25 | కసుంగాను | కసుఁగాను |
| 13 | 26 | శబ్ధప | శబ్దాప |
| 21 | 5 | శాలురైన | శాలులైన |
| ,, | 18 | రోగి | రోగిణి |
| 26 | 22 | నొకబోటి | నాకబోటి |
| 44 | 4 | బైనసార్థ | బైనసార |
| 61 | 6 | గలఁదె | గలదె |
| 63 | 23 | చేలగి | చెలఁగి |
| 64 | 25 | వధూమణి | వధూమణీ |
| 69 | 3 | ముసుత్తైలదీ | ముత్తైములదీ |
| 76 | 24 | నులైకచర్య | నుత్తైకచర్య |
| 79 | 16 | జంద్రు డన్న | జంద్రుఁ డన్న |

చదువరులారా ! దొరకినంతవఱకు కచ్చుపొరపాట్లు సవరించితిని. మఱియు నుండిన నుండవచ్చును. వానిని దామే సవరించుకొని చదువు కొందురు గాక.

ఇట్లు,
కామేశ్వరీసేవకుఁడు
పురాణం, సూర్యనారాయణతీర్థులు.

విద్వచ్ఛిరోమణివిలాసముద్రాక్షరశాల, చెన్నపురి.